

గుడిగుండెలో గంటల గణగణాలు

—చిత్రకారుడు: జె. శశిభూషణ్.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 50
సంచిక 47
**25-7-56**

దుర్ముఖ ఆషాఢ బహుళ ద్వితీయ బుధవారం


# విషయానుక్రమణిక



**ముఖచిత్రం : "బారిష్" లో నూతన్ సమర్థ్.**

# కౌలుదారుల రక్షణ

ఈనాం భూముల కౌలుదారులు గాక ఇతర భూముల కౌలు దారుల రక్షణ నిమిత్తం గవర్నర్ శ్రీ సి. ఎం. త్రివేదీ ఒక ఆర్డినెన్సు జారీ చేశారు. మొన్న జూలై 10 వ తేదీనుంచి అమలులోకి వచ్చిన ఈ ఆర్డినెన్సు రాష్ట్రి మంతటికీ వర్తిస్తుంది. ఈనాం కౌలుదారులను వారు సేద్యం చేస్తున్న భూములనుంచి తొలగించడానికి వీల్లేకుండా 1954 లోనే ఒక శాసనం అమలులోకి వచ్చిన విషయం పాఠకులకు జ్ఞాపకం వుండే వుంటుంది. ఇప్పుడు అమలు పరిచిన ఆర్డినెన్సు ఇతర భూముల కౌలుదారు లందరికీ వర్తిస్తుంది. ఉత్తరోత్తరా భూస్వామ్య సంస్కరణలు రాష్ట్రింలో అమలు జరిగ వచ్చునన్న భయంతో భూస్వాములు కౌలు దారులను అక్రమంగా తొలగించి వేయ ప్రయత్నిస్తున్న కారణం చేత, ఈ ఆర్డినెన్సును అమలు పరచవలసిన అగత్యం ఏర్పడిందని ప్రభుత్వ వివరణవల్ల తెలుస్తున్నది.

1954 ఆగస్టు 20 న ప్రకాశం ప్రభుత్వం రాష్ట్రింలో అమలు జరగవలసిన భూస్వామ్య సంస్కరణల విషయమై తగిన సిఫార్సులు అందజేయడానికి శ్రీ లక్కరాజు సుబ్బారావు అధ్యక్షతన ఒక విచారణ సంఘాన్ని నియమించింది. దాదాపు 14 నెలలపాటు ఈ సంఘం సభ్యులు ప్రత్యేక ప్రశ్నావళి ద్వారాను, రాష్ట్రింలో స్వయంగా పర్యటించడం ద్వారాను పరిస్థితులను తెలుసుకొని సమగ్రమైన ఒక నివేదికను 1955 అక్టోబరు 30 న రాష్ట్రి ప్రభుత్వానికి అందజేశారు. తమకు అందిన దాదాపు ఎనిమిదిన్నర మాసాలకు ప్రభుత్వం ఈ నివేదికను (జూలై 11 న) బహిరంగ పరిచింది. (రెండు వారాల క్రితం ఈ పత్రికలో ప్రకటించిన అంశాలకూ, అధికార పూర్వకంగా విడుదలైన అంశాలకూ తేడా ఏమీ లేదు). ఈ నివేదికను ప్రకటించిన క్రితం రోజు నుంచే ఆంధ్రా గవర్నర్ జారీ చేసిన ఆర్డినెన్సు అమలులోకి వచ్చిందంటే రెండిటికీవున్న అవినాభావ సంబంధాన్ని అర్థం చేసుకోవచ్చు. భూసంస్కరణల సంఘం గరిష్ఠ భూవసతిని నిర్దేశించడమేగాక, ప్రస్తుతం అమలులోవున్న కౌలుదారీ విధానాన్ని రద్దు చేయరాదని కూడా సిఫార్సు చేసింది. కౌలుదారుకు, భూస్వామికీ వుండవలసిన సంబంధాలను సూచించింది. అచిరకాలంలో నే ఆంధ్ర ప్రదేశ్ అనే పేరుతో విశాలాంధ్ర ఏర్పడబోతున్నది కాబట్టి, పెద్ద ఎత్తున భూస్వామ్య సంస్కరణలను చేపట్టే ఆంధ్ర ప్రభుత్వం తలపెట్ట దలచ లేదు. ప్రస్తుతానికి భూసంస్కరణల సంఘం నివేదికలో సూచించిన ప్రకారం కౌలుదారుకూ, భూస్వామికీ వుండవలసిన సంబంధాలను మాత్రమే కట్టుదిట్టం చేయాలని సంకల్పించింది. రాష్ట్రి శాసనసభ కాంగ్రెస్ పక్ష



శ్రీ నరేశ్ కుమార్, శ్రీమతి విజయలక్ష్మి, శ్రీ నెహ్రూ, శ్రీ ఆర్. కృష్ణన్.

# ★ కౌలుదారుల రక్షణ ★

కార్యవర్గం కర్నూలులో ఈ నెల 11, 12 తేదీలలో సమావేశమై భూసంస్కరణల సంఘ నివేదికను పరిశీలించిన పిమ్మట ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు చేసిన ప్రకటన ఈ సంకల్పాన్నే వ్యక్తీకరించింది. భూ సంస్కరణల విషయంలో హైదరాబాద్ ప్రభుత్వం చాలా ముందంజవేసి వ్యవహరిస్తున్నదనే విషయం తెలిసిందే. ఆంధ్ర ప్రాంతమంతా ఏకరాష్ట్రంగా రూపొందబోతున్న ఈ సమయంలో వెగిరపడి ఇక్కడ మనజిల్లాలలో ఏ సంస్కరణలను ప్రవేశపెట్టినప్పటికీ, రాష్ట్రంలో ద్వంద్వ విధానానికి దారితీసినవాళ్లమవుతాము. అందుచేత ప్రస్తుతానికి కౌలుదారీ విధానాన్ని క్రమబద్ధం చేయడంతో సంతృప్తిపడడం సముచితంగానే కనుపిస్తుంది.

రాష్ట్రగవర్నర్ అమలుపరిచిన ఆర్డినెన్సు కౌలుదారు, భూస్వామి, కమతం అనే పదాలను ఈవిధంగా నిర్వచించింది. (1) ఇతరుల భూమిని వ్రాతకోతల ద్వారాగాని, మాజువాణీగా గాని కౌలుకు తీసుకొని, తానుగాని, తన కుటుంబంలోని ఇతరులుగాని స్వయంగా కష్టపడి సేద్యంచేస్తున్న రైతును కౌలుదారుగా వ్యవహరిస్తారు; డబ్బిచ్చి కూలీలను పెట్టి స్వయంగా అజమాయిషీ వహించి కౌలుకు తీసుకున్న భూమిని సేద్యంచేయించే రైతునుకూడా కౌలుదారుగానే పరిగణిస్తారు. కౌలు షరతులు నిర్ధారణ చేసుకున్న తర్వాత ఆ భూమిమీద సేద్యానికి హక్కు భుక్తాలు ఏర్పడే వ్యక్తిని, అతడివారసులనుకూడా కౌలుదారులుగానే భావించడమవుతుందని ఈ నిర్వచనం విపులీకరిస్తున్నది. (2) కమతం: కౌలుదారు అధీనంలో వుండే భూమి; (౩) భూస్వామి: భూకామందు. కౌలుదారును తొలగించి భూమిని మొత్తంగాగాని, లేదా, అందులో కొంతభాగాన్నిగాని తన అధీనంలోకి తీసుకోడానికి హక్కు కలిగిన వ్యక్తి

ఈ ఆర్డినెన్సు ప్రకారం ఏ భూస్వామి ఇకమీద తన భూమిని సేద్యంచేస్తున్న కౌలుదారును తొలగించడానికి వీల్లేదు. కొత్తగా సివిల్ కోర్టుల ఉత్తర్వులుగాని, డిక్రీలుగాని పొందినవాటిని అమలుచేయడంద్వారాకూడా కౌలుదారులను తొలగించే హక్కు భూస్వామికి లేదు. అయితే ఇంతకు పూర్వమే భూస్వాములు కోర్టు డిక్రీలు, ఉత్తర్వులద్వారా ఏ కౌలుదారులనైనా తొలగించివేసి వున్నట్లయితే, ఆ కౌలుదారులకు తిరిగి భూమిపై సేద్యపు హక్కులను సంక్రమింపజేయడమంటూ వుండదనికూడా ఆర్డినెన్సు స్పష్టీకరిస్తున్నది.

అక్రమంగా కౌలుదారుల తొలగింపుకోసం కొత్తదావాలు దాఖలు చేయడానికి వీల్లేక పోయినప్పటికీ, 1956 జనవరి 1-వ తేదీకి పూర్వమే కోర్టులలో దాఖలైవున్న దావాలకు ఈ ఆర్డినెన్సు ఏవిధంగానూ ప్రతిబంధకం కానేరదు. ఆ పాత దావాలలో కోర్టులు ఇచ్చే డిక్రీలను, ఉత్తర్వులను స్వేచ్ఛగా అమలుజరిపి కౌలుదార్లను తొలగించవచ్చు.

మరికొన్ని పరిస్థితులలోకూడా కౌలుదారును తన భూమినుంచి తొలగించే అధికారాన్ని ఈ ఆర్డినెన్సు భూస్వామికి ఇస్తున్నది. అనుకున్న షరతుల ప్రకారం మక్తా మొత్తాన్ని సకాలంలో చెల్లించక చిన్న భూస్వాములను నానాబాధలూ పెట్టే కౌలుదారులు అనేకమంది సహజంగా వుంటుంటారు. ఈ ఆర్డినెన్సు అమలులోకి వచ్చిన నెలరోజులలోగా (అంటే ఆగస్టు 10-వ తేదీలోగా) బకాయి మక్తాను ముద్రశుద్ధిగా, బేబాకీగా చెల్లించక పోయినట్లయితే ఆ కౌలుదారును భూస్వామి తనభూమినుంచి తొలగించి వేయవచ్చు.

కౌలుకు తీసుకున్న పొలాన్ని సరిగా సాగుచేయకుండా నిర్లక్ష్యంచేసినా, భూమిగాని, అందులో వేసిన పైరుగాని నష్టపడేలా ప్రవర్తించినా, వ్యవసాయానికి గాక ఆ భూమిని అన్యథా వినియోగించినా, భూస్వామికి ఆ భూమిమీద అసలు హక్కే లేదని ఎగ్రతించినా, అప్పుడు కౌలుదారును నిరభ్యంతరంగా తొలగించివేసే హక్కు భూస్వామికి సంక్రమిస్తుంది.

కౌలుదారులు తాము చెల్లించవలసిన మక్తా మొత్తాన్ని కోర్టులలో భూస్వామిపేర జమకట్టి రసీదులు పొందవచ్చు. పాత డిక్రీలక్రిందా, ఉత్తర్వులక్రిందా మక్తా బకాయిలను చెల్లించవలసి వచ్చినప్పుడు ఆ ఉత్తర్వులు, డిక్రీలు ఏ కోర్టుద్వారా వచ్చినవో ఆ కోర్టులలోనే చెల్లించాలి.

ఈ ఆర్డినెన్సు ప్రకారంమాత్రం ఆయా ప్రాంతాలకు చెందిన రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లకోర్టులలోనే కౌలుదారులు బకాయి మక్తాలను చెల్లించవలసి వుంటుంది.

ఆర్డినెన్సు అమలులోకి వచ్చిన తర్వాత మక్తా చెల్లించవలసిన గడువు తేదీ వచ్చినట్లయితే, ఒప్పందం ప్రకారం ఏ తేదీన చెల్లించాలో ఆ తేదీ మొదలు నెల రోజులలోగా డబ్బు చెల్లించవలసి వుంటుంది. మన రాష్ట్రంలో రకరకాల కౌళ్ల పద్ధతులు ఆచరణలో వున్నవి. కౌలుదారు భూస్వామి పంటలో వాటాలు వేసుకోవడం ఒక పద్ధతి; (దీన్నే పాలు కౌలు పద్ధతి అంటారు) ఎకరానికి ఇంత మక్తా అని డబ్బు పుచ్చుకోవడం మరొక పద్ధతి. పంటలో వాటా తీసుకునే పద్ధతిన కౌలు వున్నట్లయితే, ఆ వాటాకు వచ్చే ధాన్యం ధరకట్టి ఆ డబ్బునే కౌలుదారు కోర్టులో భూస్వామిపేర జమవేయవచ్చు. భూస్వామికి ముట్టవలసిన పూర్తి డబ్బు తమకు అందగానే కోర్టువారు భూస్వామికి ఆ విషయం తెలియజేస్తారు. ఈ ఆర్డినెన్సుక్రింద కౌలుదారుల, భూస్వాముల సంబంధాలపై వచ్చే వ్యవహారాలన్నిటినీ ఆయా రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లే చూస్తుంటారు. ఆ ఆఫీసర్ల నిర్ణయాలను పునః పరిశీలన చేసే అధికారంగాని, వాటిపై "ఇంజంక్షన్ ఉత్తర్వు" ఇచ్చే అధికారంగాని ఏ ఇతర కోర్టుకూ లేదు.

ఆగస్టులో సమావేశమైనప్పుడు రాష్ట్ర శాసనసభ ఈ ఆర్డినెన్సును సాకల్యంగా చర్చించి శాసనంగా తయారు చేస్తుంది. అప్పుడే శాసనానికి కావలసిన ఇతర నియమ నిబంధనలన్నిటినీ రూపొందించడం కూడా జరుగుతుంది. భూస్వామికీ, కౌలుదారుకూ వుండవలసిన సంబంధాలను ఆర్డినెన్సు పూర్తిగా నిర్వచించడంలేదు. సాధారణంగా కౌలుకాలపరిమితి ఎంతవుండాలి, భూస్వామికి కౌలుదారు ఇవ్వవలసిన ధాన్యం వాటా ఎంత వుండాలి, న్యాయసమ్మతమైన మక్తా ఎంత మొత్తంగా వుండాలి అనే విషయాలను ఆర్డినెన్సు ఇదమిత్థమని తేల్చలేదు. శాసనసభ కాంగ్రెస్ పక్షం కార్యవర్గం మొన్న సమావేశమైనప్పుడు, కౌలుదారు భూస్వామి ప్రధానమైన నీటి వసతులు వున్న ప్రాంతపు భూముల పంటల్లో చెరిసగం తీసుకోవాలనీ, నీటితీరువ, భూమిశిస్తు మొదలైనవాటినిభూస్వామే చెల్లించాలనీ, మైనర్ ఇరిగేషన్ క్రింద సాగయ్యే భూములలోనూ, యాతాల సహాయంతో సాగయ్యే భూములలోనూ భూస్వామి వాటాలను ఇంకా తగ్గించాలనీ అభిప్రాయపడ్డది. ఈ అభిప్రాయాలనే మంత్రివర్గం స్థిరపరుస్తుందో, లేక శాసనసభ్యులు వ్యక్తపరిచే ఇతరఅభిప్రాయాలకు అనుగుణంగా మారుస్తుందో చూడాలి.

రాష్ట్రప్రభుత్వం నియమించిన భూసంస్కరణల సంఘం మొత్తం 290 ముఖ్యమైన సిఫార్సులు చేసింది. ఏ పరిస్థితులలో అయినప్పటికీ, (భూస్వామి తన భూమిని

# స్వరాజ్య మంత్రప్రదాత తిలక్ శతవార్షిక జయంతి

ఈ నెల 23-వ తేదీ లోకమాన్య బాలగంగాధర తిలక్ శతవార్షిక జయంత్యుత్సవదినం. భారత స్వాతంత్ర్య సమరగాథలో, భారతచరిత్రలో చిరస్మరణీయం. ఆరోజున అశేష భారత ప్రజా లోకమాన్యుని సంస్మరించి శ్రద్ధాంజలి ఘటించింది.

ఈ జయంతిని పురస్కరించుకుని, జూలై 12-వ లండన్ నగరంలో "ఇండియా హౌస్"లో తిలక్ వర్ణ చిత్రాన్ని ప్రధాని నెహ్రూ ఆవిష్కరించారు. లండన్‌లోని భారతీయులూ, లార్డ్ పెథిక్ లారెన్స్, లార్డ్ లిస్టోవెల్, కీ॥ శే॥ సర్ స్టాఫర్డ్ క్రిప్స్ సతి డేమ్ ఇసబెల్, హెచ్. ఎస్. ఎల్. పోలక్, పార్లమెంటు సభ్యుడు ఫెన్నర్ బ్రాక్వే ప్రభృతులు వచ్చి పాల్గొన్నారు. శ్రీ నెహ్రూ ఆవిష్కరించిన చిత్రాన్ని భారతీయ చిత్రకారులు శ్రీ దేవోస్కర్ రచియించారు. పూనాలోని "కేసరి మహారాష్ట్ర ధార్మికసంస్థ" దీన్ని ఇండియా హౌస్‌కు కానుకగా పంపారు.

"భారత విప్లవానికి పితృతుల్యుడు..." అని శ్రీ నెహ్రూ లోకమాన్యునికి జోహారు లర్పించారు.

"దిగువ మధ్యతరగతి ప్రజలను ఆకట్టుకువచ్చి ఆనాటి బాల్యదశలో ఉన్న జాతీయ కాంగ్రెసును బలవత్తరంగా, సార్థకంగా రూపొందించిన మహనీయుడు, మహాద్రష్ట..." అని ప్రధానమంత్రి చెప్పారు.

1920 ఆగస్టు 1 న తిలక్ అస్తమించడంతో, కాంగ్రెసు సారథ్యం గాంధీజీ స్వీకరించారు. అప్పట్లో కర్షక ప్రజానీకంకూడా కాంగ్రెసు పతాకచ్ఛాయకు రావడంతో ఈ సంస్థకు మరే కాలంలోనూ దేనికీ లేనంత బలం చేకూరింది.

క్రిందటి తరానికి పూర్వం స్వాతంత్ర్యోద్యమంలో మహత్తర భూమికలు నిర్వహించి, ఉద్యమం సత్ఫలప్రదాయకం కావడానికి దోహదంచేసిన మహాపురుషుల ప్రాధాన్యాన్ని, నాటి దేశకాల పరిస్థితులనూ, వారు ఎదిరించి జయించిన కష్టనిష్ఠురాలను ఈ తరం యువజనులు విస్మరించి, కించపరచే అవకాశం లేకపోలేదని శ్రీ నెహ్రూ తమ ప్రసంగంలో ధ్వన్యాత్మకంగా హెచ్చరించారు.



"స్వరాజ్యం నా జన్మహక్కు..."

బ్రిటన్‌లో చదువు పూర్తిచేసుకుని భారతదేశం వచ్చిన తరువాత, శ్రీ నెహ్రూ కాంగ్రెసు సభలో తిలక్‌ను కలుసుకొంటూ ఉండేవారు. "అప్పట్లో ఆయన ఎదటపడి మాట్లాడానికికూడా నాకు ధైర్యం ఉండేదికాదు." అన్నారు శ్రీ నెహ్రూ.

---

విక్రయించ దలుచుకుంటే కౌలుదారుకే విక్రయించాలన్నది వీటిలో ఒక సిఫార్సు. ఇంటి యజమాని తన ఇంటిని అమ్మివేయదలిస్తే ఇంట్లో అద్దెకువుంటున్న వ్యక్తికే అమ్మాలనీ, కారు యజమాని తన కారును అమ్మివేయదలిస్తే, దాన్ని నడిపిన డ్రైవరుకే అమ్మాలనీ ఆజ్ఞాపిస్తే ఎంత సబబుగా వుంటుందో, భూమిని కౌలుదారుకే విక్రయించాలనడం కూడా అంతే సబబుగా వుంటుంది. ఈ నియమాన్ని అమలుజరిపితే, పెద్ద భూస్వాముల సంగతి ఏమోగాని, చిన్న చిన్న భూస్వాములు మాత్రం అనవసరంగా అనేక కష్టనష్టాలకు గురికావలసి వస్తుంది. ★

# గీర్వాణ భాషాభ్యాసం

గత సంచిక తరవాయి

## 2

"శర్వవర్మామాత్యులు గోదావరీతీరంలో మహాతపశ్చర్యలో నిమగ్నులై సాక్షాత్తు ఆ కుమారస్వామినే సాక్షాత్కరింప జేసుకొన్నారట! స్వామి అనుగ్రహం వల్ల ఒక మాసంలోగానే నూతన గీర్వాణం వ్యాకరణం రచించారట! ఆ వ్యాకరణ సాహాయ్యంతో హాలసాతవాహన సార్వభౌములచే దేవభాషాధ్యయనం చేయిస్తున్నారట! చక్రవర్తి సంస్కృతాధ్యయనం శ్రీరామ బాణంలా అతి త్వరితంగా అమోఘంగా సాగిపోతున్నదట!"

అని ప్రతిష్ఠాన నగర దేవీ మహోద్యాన వనంలో సమావిష్టులై విటమండలిలో ఒక రక్త చుక్క తిప్పుకోకుండా తనకు తెలిసిన ఆ నూతనోదంతం అభివర్ణిస్తున్నాడు. విటమండలిలోనివారంతా అతడు చెప్పేదంతా అతి శ్రద్ధగా ఆలకించారు.

కాని విష్ణుశర్మ కదంతా అభూత కల్పనగా అతిశయోక్తిగా వినిపించింది. అతగాడు అష్టాధ్యాయి అంతా కాత్యాయన వార్తికాలతో సహా వృత్తికావిలిగా అధ్యయనం చేసినవాడు. వ్యాకరణశాస్త్రం లోతుపాతులన్నీ బాగా తెలిసినవాడు. కనక ఆ వక్త చెప్పేదిక వినలేకపోయాడు:

"చాల్చాలు లేవయ్యా! నీ ఉత్తరకుమార ప్రగల్భాలు! మహామహులైన ఆ పాణిన్యాది మునారు ఎక్కడ? ఈ శర్వవర్మామాత్యుడెక్కడ! పాణినీయం తరవాత మళ్లీ వ్యాకరణం రచించటం అంటే మాటలటయ్యా! ఇదంతా వట్టి అభూతకల్పన!"

అని నిస్సాకారంగా ముఖం మరిఒకవైపు తిప్పివేసుకొన్నాడు. ఆ వక్త శర్వవర్మామాత్యుని కుల పురోహితుని కుమారుడు. అతని నిజ నామధేయమేమో ఎవరికీ తెలియదుగాని విటమండలిలో అందరు అతనికి లంబోదర భట్టని నామకరణం చేశారు. అతని ఆకారం అన్నివిధాలా దానికి తగిఉండడమే దానికి కారణం.

విష్ణుశర్మ హఠాత్తుగా తన వాగ్ధోరణికి అడ్డుతగిలేసరికి లంబోదరుని కొంతకాలంపాటు నోటమాట పెగల్లేదు. అయినా ఎలాగో అలాగ తమాయించుకొన్నాడు:

"నీవీ బౌద్ధ శ్రమణకులతో చేరి బొత్తిగా పాషండుడవైపోతున్నావు! ఏది చెప్పినా ఇట్టే యద్దెవా చేసిపారేస్తావు! కావలిస్తే ఒకమారు నాతో రావయ్యా! నీకు శర్వవర్మామాత్యులు స్వయంగా భూర్జపత్రాల మీద స్వహస్తంతో లిఖించుకొన్న కాలాపక వ్యాకరణం చూపిస్తాను!"

"ఆ! ఆ! ఏమిటా వ్యాకరణం పేరు? కాలాపక వ్యాకరణమా! అంటే?" అన్నాడు విష్ణుశర్మ కొంచెం వెటకారంగా.

"అమాత్రం తెలియనివారు తెలియనట్టుగా కిమ్మనకుండా మాటాడకూరుకోవాలి. అంతేగాని అయినదానికీ కానిదానికీ తగుదునమ్మా అని కలగజేసుకోకూడదు!" అన్నాడు లంబోదర భట్టు బింకంగా మూతిబిగించి.

శర్వవర్మ మంత్రి తాము రచించిన నవ వ్యాకరణానికి కాలాపక వ్యాకరణమని పేరు పెట్టారు. తెలిసిందా!" అన్నాడు లంబోదర భట్టొక చిరునవ్వునవ్వి.

"ఏమో! ఏ పుట్టలో ఏ పాముందో ఎవరు చెప్పగలరు!" అన్నాడింకొక విట ముఖ్యుడు.

లంబోదర భట్టా మాటతో మరింత విజృంభించాడు:

"శర్వవర్మ మంత్రివర్యులకొకనాటి రాత్రి అత్యద్భుతమైన స్వప్నం వచ్చినదట! ఆ స్వప్నంలో ఒక తెల్లని వేయిరేకుల తామరపూవు ప్రాతఃకాల సూర్యబింబంలా వికసించినదట!" అని 'చూడండి' నాకెలాంటి అత్యద్భుతరహస్యాలు తెలిశాయో? అన్నట్టు లంబోదర భట్టందరివైపు చూచి మాట్లాడ కూరుకొన్నాడు.

"కథ కానీయవయ్యా! భట్టాచార్యవర్యా!" అన్నాడు విష్ణుశర్మ కొంచెం విసుగ్గా.

లంబోదరభట్టు తిరిగీ తనకథ ప్రారంభించాడు:

"ఆ సహస్రదళ పద్మంలోనించి సాక్షాత్తుగా సరస్వతీదేవి అమ్మవారావిర్భవించినదట! అలాగ ఆవిర్భవించినదై ఆ అమ్మవారు హంసతూలికా తల్పంపై హేలగా శయనించిన హాలసాతవాహన సార్వభౌముల ముఖపద్మంలో ప్రవేశించి అదృశ్యమైపోయినదట!"

## ప్రాచీన గాథాలహరి

"అపరాధం! అపరాధం! అదేమిటో సెలవియ్యవయ్యా! లంబోదరభట్టాచార్యా!" అన్నాడు విష్ణుశర్మ అంతకన్నా మరింత వెటకారంగా. లంబోదరభట్టు ఒకింతసేపు సదస్యులందరివైపు హేలగాచూచి కాలాపక వ్యాకరణ పదానికి భాష్యం ఉపక్రమించాడు. దానికోసం ఒకప్రశ్న చేశాడు:

"కార్తికేయస్వామివారి వాహనం ఏమిటండీ?

"మయూరం!" అన్నాడొక విటశిఖామణి.

"ఆ మయూర వాహనంయొక్క పింఛానికి పర్యాయపదం ఏమిటయ్యా!"

మళ్లీ ప్రశ్నించాడు లంబోదర భట్టు విష్ణుశర్మ వైపుతిరిగి.

"కలాపం"

"ఆ కలాపం నామధేయంతోనే శర్వ

పి. గణపతిశాస్త్రి

"ఆ అద్భుత వృత్తాంతం యావత్తూ శర్వవర్మ మంత్రి వెంటనే సార్వభౌములకు విన్నవించి ఉంటారు! అంతేనా?" అని హఠాత్తుగా అడ్డుతగిలాడు విష్ణుశర్మ.

"అవును! అది మీకెలాగ తెలిసింది?" అని ఎంతో ఆశ్చర్యపోయాడు లంబోదరభట్టు.

"ఇందులో అంత తెలియడానికేమి ఉంది! ఏమైనా శర్వవర్మ చాలా ఘటికుడు!" అన్నాడు విష్ణుశర్మ మరీ వెటకారంగా.

"ఎందుచేత?" అని తీవ్రంగా ప్రశ్నించాడు లంబోదరభట్టు.

"ఎందుచేతేమిటి? ఏవో నాలుగు కల్లబొల్లి కట్టుకథల్లి చల్లగా చక్రవర్తిని తన వలలో వేసుకొంటున్నాడులే! లేకపోతే

...మిటిదంతాను! చెప్పేవారికి లేకపోతే వినే వారికైనా కించిత్తు వివేకం ఉండవద్దూ! గుణాఢ్య మహామంత్రికి కొంచెం కాలు, చెయ్యి వంగినప్పటినుంచీ ఈ శర్వవర్మ మంత్రికిక పట్టపగాలు లేకుండా పోతున్నాయి! ఒక పెద్ద తాటిచెట్టంత ప్రభ కట్టుకొని అశ్వరథ! శరభ! అని అదేపనిగా నృత్యం చేస్తున్నాడులే!"

ఈ విధంగా తానెంతో భక్తిశ్రద్ధలతో అభివర్ణించినదంతా ఒక్క క్షణంలో యశేవా చేసి పారేసేటప్పటికి లంబోదరభటు భగ్గున మండిపడ్డాడు:

"నీవు వటిపాపండవు! అబద్ధం తలకెక్కినప్పటినించీ నీకున్న మతికూడా పోతూంది! లేకపోతే ఏమిటీ అప్రాచ్యపు మాటలు!" దానితో విష్ణుశర్మకూడా రెచ్చిపోయాడు:

"ఇదిగో! నన్నేమన్నా అనుగాని బౌద్ధులనేమైనాఅన్నావంటే నేనూరుకోనేదిలేదు. తెలిసిందా! వాళ్లు కేవలం అహింసా స్వరూపులు! ధర్మమూర్తులు! నీకేం తెలుసును వాళ్లవిషయం!"

"వాళ్లా! వాళు వటి పరమ మూర్ఖులు. అవైదికులు. ఉపక్కతిరం తప్ప వాళ్ళకేమీ తెలియదు! నీవంటి మూర్ఖులింకా కొంత మందిని చేర్చి ఊయా వాడా ఊరేగుతున్నారు!"

అని లంబోదరభట్టు అట్టుడికి పోయినట్టుడికి పోయాడు అతనిముఖం బాగా ఎర్రబడిపోయింది.

అంతలో ఇంకొక విటశేఖరు డందుకొన్నాడు:

"ఆ! ఆ! ఆగండయ్యా! ఆ బౌద్ధుల సిగతరగా! వాళ్ళగొడవ మనకెందుకయ్యా! కావలిస్తే వాళ్లు, మీరుకలిసి కట్టకట్టుకుని గోదావరిలో దిగండి!...అన్నట్టు ఇదుగో! ఉజ్జయినీ నగరంనించి గజైలపుత్రం లాంటి వారాంగనామణి ఒకతె ఈమధ్యనే మన నగరానికి వచ్చిందట! మీరెవరైనా గాని ఆసుందరిని నేత్రపర్వంగా తిలకించారా?" అన్నాడు.

"అవునవును! మాళవికమాటేనా నీవనేది! ఆహా! ఎంతటి అందగత్తె! ఆమె కర్ణాభరణాలల్లాడుతూ, చిన్ని చెక్కిళ్ళపై ముక్కల్లా ప్రతిఫలిస్తాయట!" అన్నాడొక విటుడు

"సీధు పానం చేస్తూంటే ఆసీసువు గళనాళంలో తళతళా మెరసిపోతుందట!" అన్నాడు మరి ఒకడు.

"ఈకథ అంతా శర్వవర్మ మంత్రి సరస్వతీ సాక్షాత్కారం లాగే ఉందోయ్!" అన్నాడు విష్ణుశర్మ మళ్ళీ

"శర్వవర్మామాత్యులంటే నీకేదో మహా హేళనగా ఉంది గాని — రేపు మాఘమాసంలో విద్వత్పరీక్ష జరిగేదాకా కొంచెం వేచి ఉండవయ్యా! అప్పుడే తెలుస్తుంది నీకు శర్వవర్మ మంత్రి ప్రతిభా చాకచక్య మెలాంటిదోను!" అన్నాడు లంబోదరభట్టు కొంచెం గుసుసుగా. అంతలో అనతిదూరంలో మహేశ్వర దేవాయతనంలో సాయంకాల మంత్ర పుష్ప ఘంటాధ్వనులు మారుమోగాయి.

విటమండలిలో వారందరు ఒకరొక్కరే తమ తమ గృహాలకు మళ్ళిపోయారు.

పదిమంది నోళ్ళల్లోపడి పలువిధాలుగా చిలువలు పలువలు వేసినా శర్వవర్మ మంత్రి కాలాపక వ్యాకరణం రచించిన విషయం వాస్తవమే. ఆవ్యాకరణంలో అతడు పాణినీయవ్యాకరణంలోని ప్రక్రియా భాగం అంతా విసర్జించి సాధుశబ్ద జ్ఞానంకోసం అత్యవసరమైన ప్రక్రియ మాత్రమే కల్పించాడు.

హాల సాతవాహన చక్రవర్తికి గీర్వాణ భాషా ప్రవేశం లేకపోతే లేకపోవచ్చును. కాని అతడు ప్రాకృతవాణిలో పేరెన్నికగన్న పండితుడు.

సంస్కృత ప్రాకృతాలత్యంత సన్నిహితమైన భాషలు కావడంవల్ల క్రమక్రమంగా చక్రవర్తికి దేవవాణిలో కొంచెం ప్రవేశం కలిగింది. ఆపైన శర్వవర్మ తాను పూనిన ప్రతిజ్ఞ నెరవేరాలనే అహమహమికతో ప్రతిదినము ఆయనచేత దేవభాషాధ్యయనం చేయించాడు.

దేవవాణీ మాధుర్యం ఆస్వాదించాలనే ఆసక్తికొద్దీ చక్రవర్తికూడా ఆ విషయంలో బాగా శ్రద్ధ వహించాడు.

అదీగాక ఆరుమాసాల అనంతరం ఆ విషయంలో విద్వత్పరీక్ష జరగాలనే నిరయం కూడా జరిగింది అందుచేత ఆ అవధి సమీపించినకొద్దీ చక్రవర్తి సంస్కృత భాషాభ్యాసంలో మరింత శ్రద్ధ వహించాడు. క్రమక్రమంగా ఆ ఆరుమాసాల అవధి పూర్తి అయ్యేసరికి హాల చక్రవర్తికి గీర్వాణ పాండిత్యం అంటే ఏమిటో చాలావరకు అవగాహన అయింది.

అప్పటికి చక్రవర్తికి వాల్మీకిరామాయణంలోని సరళ సర్గలు కొన్ని వ్యాఖ్యాన సహాయంతో అర్థంచేసుకొనే శక్తి కలిగింది.

"ఆహా! దేవతావాణిలో వాల్మీకి మహర్షి సరళస్వచ్ఛకవితామృతధార ఆస్వాదింపగలిగిన వారెంతటి ధన్యులు! ఏనో మహత్తరమైన పూర్వజన్మ పుణ్యపరిపాకం లభిస్తేనే గాని ఇంతటి మహాభాగ్యం కలగదు!" అనుకొన్నాడు.

ఒకనాటి రాత్రి మలయవతితో ఆ విషయం చెప్పి తన మహాభాగ్యానికెంతో ఉప్పొంగిపోయాడు. దానికంతటికీ శర్వవర్మామాత్యుడే ప్రధాన కారణమనీ, ఏ ప్రత్యుపకృతి చేసినా మరి తానిక అతని ఋణం తీర్చుకోలేననీ అన్నాడు.

ఆ మాటతో చక్రవర్తి గాఢాశ్లేషంలో ఆణిగి మణిగి అతని ప్రసంగం వింటున్న మలయవతి హఠాత్తుగా అతని ఆశ్లేష బంధనం విడిపించుకొని [illegible] దూరంగా తొలగిపోయింది. కాలిబొటన వేలుతో నేలపై వ్రాస్తూ కొరకొరలాడింది

"ఎంతచేసినా ఇంతే! కృతఘ్నత మీకు వెన్నతో పెట్టినవిద్య!" అని [illegible] మరి మాటాడలేకపోయింది.

చక్రవర్తికి తానుచేసిన అపరాధమేమో బోధపడలేదు కొంతసేపటివరకు ఏమీ పాలుపోక అలాగే తెల్లబోయాడు అంతలో హఠాత్తుగా అతనికి తానుచేసిన తప్పిదం స్ఫురించింది. వెంటనే ఆమె పాదాలపై వాలిపోయాడు:

# గీర్వాణ భాషాభ్యాసం

"నిజంగా నీమూలంగానే నాకీ గీర్వాణ పాండిత్య భాగ్యం కలిగింది. ఏదోమాట తొందరలో ఆమాట మరిచిపోయాను. పొరబాటే!"

అని ఆమె పాదాంగుళులు ముద్దుపెట్టుకొన్నాడు.

అయినా అది లక్ష్యపెట్టక ఆమె మరింత దూరంగా తొలిగిపోయింది.

చక్రవర్తి మరి వేరే ఉపాయంలేక సమీపంలో ఉన్న సువర్ణవేత్రం ఆమె చేతిలో ఉంచి అరిచేయి ఆమె కెదురుగా ఎత్తిపెట్టి అతి వినయంగా విన్నవించుకొన్నాడు:

"లీలావతీ! నావల పెద్ద తప్పిదమే జరిగిపోయింది. దానికి మరి నీవే శిక్ష విధించినా సరే!" అతని వైఖరి చూచేసరికి లీలావతి కోపం అంతా ఒక్కసారిగా అదృశ్యమైపోయింది. ఎంత నిగ్రహించుకొన్నా లోలో పలనించి పొంగి పొంగి వస్తున్న చిరునవ్వాగలేదు:

"ఇచ్చకాలు చెప్పడంలో ఇంతటి నైపుణ్యం ఉన్నవారితో ఇక ఎవరు నెగ్గగలరు!"

అని అదేపనిగా అతని అరిచెయ్యి ముద్దు పెట్టుకొన్నది:

"ఇంత కష్టపడి మీకు సంస్కృతం బోధించానే! నాకు గురుదక్షిణ ఇవ్వాలనైనా అనిపించలేదు గదా మీకు!"

"ఏదీ! నీ వెప్పుడు కోరనేలేదే!

"అయితే కోరినకోరిక తప్పక చెల్లిస్తారు కదూ?"

"అలాగే!"

"అయితే ఆలోచించి మరీ కోరుకుంటాను." అని లీలావతి అతని గాఢాశ్లేషంలో లీనమైపోయింది.

౨

మాఘమాసప్రారంభానికి శర్వవర్మ మంత్రి పెట్టిన ఆరుమాసాల గడువు తీరిపోయింది. మహామాత్యుడు చక్రవర్తి సన్నిధిలో ఉన్న సమయంలో శర్వవర్మ తన ప్రతిజ్ఞానిర్వహణ విషయం ఆయనకు తెలియజేశాడు. గుణాఢ్యుడు మొట్టమొదట చక్రవర్తి గీర్వాణ పాండిత్య విషయంలో అంతగా ఆసక్తి కనబరచలేదు.

"మంత్రివర్యా! దీనిలో ప్రత్యేకంగా పరీక్షించవలిసింది ఏమిఉన్నది! మీరెంతో శ్రమపడి ఒకవినూతనవ్యాకరణంవిరచించి స్వయంగా శ్రీవారిచేత గీర్వాణ భాషాభ్యాసం చేయించారయిరి! మీ వ్యాకరణమే చాలు! ఎలాంటి మందబుద్ధులకయినా ఆరుమాసాల్లో గీర్వాణ పాండిత్యం కలిగించడానికి! ఆపైన చక్రవర్తి వంటి మహా ప్రతిభావంతులా వ్యాకరణం పఠించినప్పుడు వారికి గీర్వాణంలో పాండిత్యం కలగకుండా పోతుందా ఏమన్నానా? ఎంతమాట!" అని ఆ విషయం అంటీ అంటనట్టుగా తేల్చివేశాడు. అలాగ తేల్చివేశాడన్నమాటేగాని చక్రవర్తి కంతటి పాండిత్యం కలిగిందని గుణాఢ్య మంత్రికేమీ నమ్మకం కలగలేదు.

కాని శర్వవర్మ ఆ విషయం అంతటితో విడిచిపెట్టలేదు. ప్రతిష్ఠాన నగర విద్వద్వరేణ్యులందరు చక్రవర్తి పాండిత్య ప్రకర్ష పరిశీలించి జేజేలర్పించాలనీ, ఆమహోత్సవం తాను కళ్ళారా చూచి ఆనందించాలనీ పట్టుపట్టాడు. అలాంటి సందర్భంలో చక్రవర్తి అతని మాట కాదనడానికి కిష్టపడలేదు. విద్వత్పరీక్షజరిపించడానికికొక శుభముహూర్తం కూడా ఏర్పాటయిపోయింది.

అనంతరం కొన్నాళ్ళకు దక్షిణాపథసార్వభౌముడు హాలసాతవాహన చక్రవర్తినిండుపేరోలగంలో కొలువై ఉండగా వందిమాగధు లందరు ముక్తకంఠాలతో కైవారాలు చేశారు. మహామాత్యుడు గుణాఢ్యమంత్రి, శర్వవర్మ, మరికొందరు రాజమంత్రులు తమ తమ సముచితాసనాలలో సమాసీనులైఉన్నారు. చక్రవర్తి కిరువైపులా చామరగ్రాహిణులు వింజామరులు వీచుతూండగా విదూషకుడు విశ్వంభరశర్మ నెమ్మదినెమ్మదిగావచ్చి కొలువుకూటంలో ఒకమూల కూర్చున్నాడు. శర్వవర్మ మంత్రి ఆనాటి విద్వత్పరీక్షకు అయిదుగురు గీర్వాణ విద్వాంసుల నేర్పాటు చేయించాడు.

ఆ అయిదుగురు విద్వాంసులను గుణాఢ్య మహామాత్యులే ఎన్నుకోవాలని మొట్టమొదట అతడెంతైనా పట్టుబట్టాడు.

కాని దానికి గుణాఢ్యుడెంత మాత్రము అంగీకరించలేదు. "మంత్రి వర్యా! ఈ ఎన్నిక మీరు చేస్తే ఒకటి నేను చేస్తే ఒకటినా! ఎంత మాట సెల విచ్చారు! దీనిలో మీరంతగా పట్టుబట్ట వలిసిందేమి ఉంది! ఎవరు ఎన్నిక చేసినా ఒకటే!"

అని చాలా మృదువుగా ఆ విషయం తేల్చివేశాడు. అయితే శర్వవర్మ అంత మాత్రం చేత ఆ విషయంలో ఉపేక్ష వహించలేదు. గుణాఢ్య మంత్రికి అన్నివిధాలా బాగా సన్నిహితులయిన గీర్వాణ విద్వాంసులనే పరీక్షకులుగా ఏర్పాటు చేశాడు. అందుచేత చక్రవర్తి ఆ స్థానంలోని వారంతా శర్వవర్మ చాతుర్యము, రాజనీతిజ్ఞత వేనోళ్ళ ప్రశంసించారు.

కనకనే శర్వవర్మ ప్రభువు వారి కృపాకటాక్షాని కంతగా సన్నిహితులైనారనీ ప్రభువుల గుణజ్ఞత కది ఒక ప్రబలనిదర్శనమనీ శర్వవర్మకు వినపడీ వినబడనట్లుగా గుసగుసలాడుకొన్నారు.

అంతలో గుణాఢ్య మహామంత్రి ఆగామి వసంతోత్సవానికి ప్రత్యేకంగా ఏర్చికూర్చిన ప్రాకృత గాథలు కొన్ని శర్వవర్మకు నివేదించాడు. ఆవిషయం చక్రవర్తి చూచీ చూడనట్లూరుకున్నాడు.

"ఈ కవితావిషయం నావంటి అల్పజ్ఞునికేమి తెలుస్తుంది! ప్రాకృత గాథాభిమానులు ప్రభువువారుండగా మధ్య నేనెంతటివాణ్ణి!" అని ఆ గాథలు గుణాఢ్యుని దగ్గరనించి స్వీకరించి వెంటనే చక్రవర్తికి సమర్పించాడు. శాతవాహన చక్రవర్తి కటాక్షలేశం ఒకక్షణకాలమా గాథలవైపు, గుణాఢ్యునివైపు ప్రసరించింది.

ప్రతివిషయము అత్యంత జాగరూకతతో గమనిస్తున్న విశ్వంభరశర్మ దృష్టి ఒకమారు చక్రవర్తివైపు తిరిగింది:

"చక్రవర్తి తమ సుదీర్ఘ నేత్రాంతాలు కుంచించి ఏదో ధ్యానంలో పడ్డట్టున్నారు! ఇంకా రూపకప్రారంభానికి నాందీ ప్రస్తావన జరగలేదేమా!" అని ఆలోచిస్తున్నారేమో " అని విశ్వంభరశర్మ కొంచెం జిజ్ఞాసలో పడ్డాడు.

అనంతరం శర్వవర్మ లేచినిలబడి విద్వద్వరేణ్యులందరికీ సవినయంగా నమస్కరించి తత్కాల కర్తవ్యాన్ని గురించి ప్రసంగించాడు:

"నావంటి అల్పజ్ఞుడీ కాలాపక

వ్యా క ర ణం ర చిం చ డ మ చేసి సాక్షాత్తు ఆ కార్తికేయ స్వామి కరుణా కటాక్షంవల్లనే సిద్ధించింది. కాక పోతే మహర్షి ప్రతిభా సాధ్యమైన వ్యాక రణ రచన ఎక్కడ! నే నెక్కడ!

ఆ వ్యాకరణం వలన అత్యంతక్లిష్టమయిన సంస్కృత భాషా భ్యాసం బాగా సుగమమయినదనిని వైయాకరణ విద్వాంసు లందరు సెలవిస్తున్నారు. అది వారి అపార సౌజన్యానికి మాత్రమే తార్కాణమనీ నిజంగా నా వ్యాకరణంలో అంతటి ఘనత ఏమీ లేదనిన్నీ నాకు తెలియకపోలేదు.

"అయితే ప్రభువు వారింతటి స్వల్పం కాలంలో అంతటి గుణ్యాఢ్యమయిన సంస్కృత పాండిత్యం ఎలాగ సంపాదించ గలిగారయ్యా! అని తమ మెవరైనా ప్రశ్నించవచ్చును ప్రాకృత విద్వద్వరేణ్యులు, అపార ప్రతిభాశాలురు అయినందువల్లనే ప్రభువువారా విధంగా అంతటి మహాపాం డిత్యం సాధింపగలిగారనిన్నీ కార్తికేయ స్వామి కరుణా కటాక్షం వల్లనే నేనీ విధంగా నా ప్రతిజ్ఞ చెల్లించుకోగలిగాననిన్నీ భావిస్తున్నాను ఇంతకీ ఇవ్వన్నీ మీవంటి మహా విద్వాంసులు సెలవీయవలసినమాటలు! దీనిలో నా అవినయం మన్నించవలసిందని ప్రార్థిస్తున్నాను.

"తమ గీర్వాణ పాండిత్య ప్రకర్ష ఒకసారి విద్వాంసులందరికీ చవిచూపించ వలసిందని శ్రీ వారిని ప్రార్థింపగా మన అందరియెడల వారికుండుకున్నటువంటి ఆదరణ విశేషం చేతనే వారీ విద్వత్పరీక్షకంగీకరించినారు. అది వారి అపారౌదార్యానికి మాత్రమే తార్కాణం!"

శర్వవర్మ ఈవిధంగా విన్నవించగానే నిండు పేరోలగంలో అంతటా సాధువా దాలు, అభినందన పరంపరలు చెలరేగాయి.

వెంటనే విద్వత్పరీక్ష ప్రారంభమయింది. పరీక్ష కేర్పరచిన విద్వాంసులు, వాల్మీకి రామాయణ శ్లోకాలు, కొన్ని ప్రాస్తావిక శ్లోకాలు పఠించారు. చక్రవర్తి వెంటనే వాటికన్నింటికీ అర్థాలు అంతరార్థాలు కూడా వివరించాడు. ఆవిధంగా ఒక గడియవరకు పరీక్ష సాగింది.

అటుపిమ్మట ఒక విద్వాంసుడు లేచి—"సార్వభౌమా! తమ పాండిత్యం నిరుప మానం! ఇక ఎంత పరీక్షించినా చర్విత చరణమే!" అన్నాడు.

వెంటనే కొలువుకూటంలో హర్షాభి నందనా లావిర్భవించాయి.

అంతలోనే మరి ఒక విద్వాంసుడు లేచి నిలుచున్నాడు:

"ఇంతటి స్వల్పకాలంలో గీర్వాణ పాండిత్యం సంపాదించడం అత్యద్భుతం! అయితే దీనికి శర్వవర్మాచార్యుల వ్యాక

రణం కారణమో ప్రభువర్యుల ప్రతిభా విశేషం కారణమో సరిగా నిర్ధారణ చెయ్యలేక పోతున్నాము." అని నెమ్మదిగా కూర్చున్నాడు.

"రెండూ కారణాలే! దానికి శర్వవర్మామాత్యుల ప్రతిభా విశేషంకూడా తోడైనది! ఇక చెప్పేదేముంది!" అన్నాడు విదూషకుడు విశ్వంభరశర్మ.

గుణాఢ్యుడింతా జాగ్రత్తగా పరిశీలిస్తూనే ఉన్నాడు. తన కన్నెంతో పులయిన విద్వాంసులుకూడా ముక్తకంఠాలతో చక్రవర్తి పాండిత్యం ఆకాశానికెత్తి ప్రశంసించేసరికతడిక తన కన్నులే నమ్మలేకపోయాడు! అయినా ఎక్కడా చెక్కు చెదరకుండా శిలాప్రతిమలా అలాగే కూర్చున్నాడు.

అంతలో విశ్వంభరశర్మ తిరిగీ లేచి నిలుచున్నాడు:

"మహాప్రభూ! మా తాతముత్తాతలందరు మహా సంస్కృత విద్వాంసులు. చిన్నతనంనించి ఆకతాయిగా తిరగడంవల్ల నాకొక్కడికే వారి నైపుణ్యం పట్టుబడలేదు. అయితే శర్వవర్మామాత్యులొక చక్కని రాజమార్గం వెయ్యడంవల్ల ఇక నాలాంటివాడు కూడా సులువుగా మహావిద్వాంసుడై పోవచ్చును సందేహమేమీ లేదు. అయితే దీనివల్ల ఒక్క పెద్ద ప్రమాదం ఏర్పడేటట్టుంది. ప్రతిష్ఠాన నగరంలో నావంటి మందబుద్ధులందరు ఇక మహా గీర్వాణ విద్వాంసు లయిపోయే పక్షంలో వీరందరిని పోషించడానికి ప్రభువులవారి కోశాగారానికి శక్తిచాలదేమోనని భయంగా ఉంది! ఇది చాలా గాఢంగా పరిశీలించవలసిన విషయం! ఆ పైన మరి తమ చిత్తం!"

అటుపిమ్మట పరీక్షక విద్వాంసు లిద్దరు ముగ్గురు ప్రసంగించారు. వారంతా చర్విత చర్వణంగా చెప్పినదే చెప్పుకుపోయారు

అంతవరకు గుణాఢ్యుడు తానై లేచి నిలబడి ప్రసంగించడానికిష్టపడనే లేదు. కాని శర్వవర్మ అతనిని విడిచిపెట్టలేదు. సవినయంగా లేచి నిలుచున్నాడు. ఒకసారి చక్రవర్తి ముఖం పరిశీలించాడు. ఇంకొకమారు గుణాఢ్యుని ముఖంవైపు చూచాడు. నెమ్మదిగా అంటున్నాడు:

"ఎందరెన్ని విధాల ప్రశంసించినా మహామహామాత్యుల అభ్యనుజ్ఞ లభిస్తే తప్ప చక్రవర్తి కింకా సంతృప్తి కలిగినట్లు కనబడదు. ఇంతకీ మరి గుణాఢ్యమహామాత్యులేమని సెలవిస్తారో!"

ఆపైన గుణాఢ్యునికిక ప్రసంగించక తప్పలేదు అతడు సునిశిత నేత్రాలతో సదస్సంతా ఒకమారు పరిశీలించాడు. ఎక్కడా చెక్కుచెదరకుండా ఒక చిరునవ్వు చిలకరించాడు:

"ఇది గీర్వాణ విద్వాంసులందరికీ పర్వదినం! ఎందుచేతనంటే శర్వవర్మామాత్యుల తపోబలంవల్ల, వ్యాకరణంవల్ల గీర్వాణవాణి అందరికీ కరతలామలకమైనది.

(53-వ పేజీ చూడండి)

# అటూ - ఇటూ

కాంతారావు పట్టుదలగా దినపత్రిక చదువుతున్నాడే గాని విషయాలేమీ మనస్సుకు పట్టడం లేదు. ఆ సంగతి తెలుస్తూనే ఉంది. అయినా చదవడం మాని కూర్చోవడం మరీ కష్టంగా వుంది. ఊరికే నే కూర్చుంటే తోటి ప్రయాణీకులతో తప్పనిసరిగా మాట్లాడవలసి వస్తుంది. ఇప్పుడు తన మనస్సు కులాసాగా లోకాభిరామాయణం చర్చించే పరిస్థితిలో లేదు... తనను శాంతిముగా పేపరు చదువుకోనిచ్చేట్టు కూడా లేరు తోటి ప్రయాణీకులు. ఒకరిద్దరు ఆ మధ్య కాగితాలిలా ఇస్తారా? అంటే నిర్మొగమాటంగా చెప్పేశాడు. "నేను అంతా చదవంగానే ఇవ్వను; చదివేక పూర్తి పేపరే ఇస్తాను. నాకు తిరిగి ఇవ్వనక్కర్లేదు కూడా!" అనేవాడు గాని, అలా అన్నందుకు తనగురించి ఎదుటివాళ్లు ఏమనుకుంటారో అన్న సంకోచం మొదలవడంతో తనను తానే సమర్థించుకొన్నాడు. 'వీళ్ళిష్టం వచ్చినట్లు అనుకోనీ. నాకూ వీళ్లకూ ఏమిటి సంబంధం? మళ్ళీ ఎప్పుడయినా కలుస్తామో లేదో—కలిసినా గుర్తుండదు. ఇటువంటి వాళ్లకు నా గురించి ఎటువంటి అభిప్రాయం కలిగితే నేమిటి నష్టం?' అంతవరకు ఆలోచన బాగానే సాగింది. ఆ తరువాతనే తాను అణచిపెట్టుకోవాలనుకొంటున్న స్ఫురణ పైకి వచ్చింది.

రైలు దిగడంతోనే విడిపోయే ఈ మనుష్యులకు పేపరు చదువుకొందు కివ్వడంవంటి చిన్న విషయంలోనే మనసు ఇంతగా గుంజాటన పడుతున్నాది కదా, ఇంతకాలం కలిసి ఉండి, ఆజన్మాంతం కలిసి ఉండవలసిన తనకూ కాంతకూ ఈ కొద్దిరోజుల ఎడబాటే ఎంతో ఎడాన్ని తెచ్చిపెట్టడం వింత కాకపోయినా మనసుకి చాలా కష్టం కలిగించడంలో సందేహం ఏమీ లేదు.

ఉద్యోగరీత్యా, వ్యాపారరీత్యా, ఇంకా ఇతర కారణాలవల్ల భార్యాభర్తలు ఎడంగా ఉండవలసి రావడమున్నది, ఒక్క తమరికే కాదు, ఎందరికో వర్తించేదే. అయితే అంత మాత్రంలో ఇలా......

మనసులో కూడా తెక్కన సంగతిని ఊహించడం కష్టంగా తోచింది కాంతారావుకి.

కాంతా తనూ తమ పెళ్ళి అయినతరవాత ఈ పది సంవత్సరాల కాలంలోనూ ఇదివరకెన్నడూ ఒక్కరోజయినా విడిగా ఉండలేదు. ఏవో చిన్న చిన్న అభిప్రాయభేదాలూ పేచీలాటలూ అప్పుడప్పుడు సంభవించినా మొత్తానికి తమది అనుకూల దాంపత్యమనే అనుకోవాలి. ప్రధానమైన అన్ని అంశాలలోనూ కాంత తనతో ఏకీభవించింది. ఆమె మూలంగా తాను శాంతిమూ సౌఖ్యవంతమూ అయిన జీవితాన్నే సాగించాడింతకాలమూను... కాని, కాని...

ఈ పదేళ్ల కాలంలోనూ తాను కన్న కల నేటికి నిజమయింది. తాను ఒక హైస్కూలుకి ప్రధానోపాధ్యాయుడు కాగలిగేడు. కాని కాకపోయి ఉంటేనే బాగుండే దేమో? ఈ ప్రధానోపాధ్యాయ పదవి

పంతుల శ్రీరామశాస్త్రి

అంటూ వచ్చి ఉండకపోతే తనకు కాంతను విడిచిపెట్టి దూరంగా వెళ్లి ఉండవలసి వచ్చేదే కాదు. దూరంగా ఉన్నంత మాత్రంలో మునిగిపోయిందేముంది? ఎందరో మంది అలా ఉంటున్నారు. అయినా తన దురదృష్టం కాకపోతే, ఈ రెండు మూడు నెలలకే ఇటువంటి పుకార్లు చెలరేగాలా? ఈ అపవాదులు లేవదీసేవాళ్లకు నిజానికి ఒరిగిపడే దేముంటుంది? అమాయకులయినవాళ్లు ఆరాటపడుతూ ఉంటే చూడడమే అదొకరకం విషమయమయిన ఆనందం.

భార్యాభర్తలు కొంతకాలం ఎడంగా ఉన్నారనే సరికల్లా అపవాదులు తప్పవన్నది ఈనాటి సంగతి కాదు. సాధు సీతా మహాసాధ్వికే తప్పింది కాదు. శ్రీరామచంద్రుడంతటి వాడికి తన మనస్సులో స్పష్టంగానే తెలుస్తూ ఉన్నా లోకాపవాదాన్ని ఆధారం చేసుకొని నిండు చూలాలిని అడవుల్లో విడిచి రమ్మని ఆజ్ఞాపెంచవలసి వచ్చింది. ఏం చేసినా అతడికి సీతా సౌశీల్యం విషయంలో ఎటువంటి అనుమానం లేదు. కేవలం ఆదర్శ ప్రభువుగా దేశజనరంజన క్రియాదీక్షాతత్పరుడై ఆమెను విడిచిపెట్టేడు. విడిచిపెట్టబడిన సీతా సాధ్వికి కూడా తన విషయంలో భర్తకు ఎటువంటి అనుమానము లేదనీ, కేవలం లోకవ్యవహారంగా తప్పనిసరిగా అలా ప్రవర్తించవలసి వచ్చిందనీ తెలుసును.

తానూ కాంతా మామూలు మానవులు. తమ మధ్య నిజంగా ఎటువంటి వైమనస్యమూ రాకుండా ఉండాలే తప్ప, తను విన్న ఈ పుకార్లలో ఎన్నివవంతు సత్యమైనా మరి తను తలఎత్తుకొని తిరగగలడా? అందరూ తనను వేలెత్తి చూపుతారు. అదివరకు అస్తవ్యస్తంగా ఉండే స్కూలును తాను ఈ రెండు మూడు నెలల్లోనూ ఎంతో క్రమబద్ధంగా చేసేడు. విద్యార్థులూ, ఇతర ఉపాధ్యాయులూ మొదట్లో తానంటే కంటగించుకొనినా క్రమంగా తనను అర్థం చేసుకొన్నారు. విద్యార్థులు వినయవిధేయతలలవరచుకొంటున్నారు; ఉపాధ్యాయులు శాంతంగా సంతోషంగా సహకరించడం ప్రారంభించారు. ఇటువంటి పరిస్థితిలో తనను గూర్చి, ఇటువంటి అపవాదు నిజమని రూఢి అయితే మరింకేమయినా ఉందా? తన ఇంటినీ ఇల్లాలినీ అదుపు ఆజ్ఞలలో ఉంచుకోలేనివాడు ఇతరులను ఆజ్ఞాపించడం హాస్యాస్పదంగా ఉండదూ?

గౌరవాగౌరవాల మాటకేం, తన కాంతే తనకు కాకుండా పోయినప్పుడు తన జీవితానికి అర్థం ఏముంటుంది? ఆ నీరసమయిన, అవమానభరితమయిన జీవితాన్ని సాగించేకంటె చావడం మేలు. అయితే, అసమర్థుడుగా వట్టినే చచ్చిపోవడమేనా? ప్రతిక్రియ చేయకుండానేనా? ప్రతిక్రియ? ఎవరిమీద? ఎవరిమీద నేమిటి, వాడు సుందరంగాడే ఇంతకీ కారణం-మేనల్లుడు కదా అని చనవిచ్చినందుకు తన కాపురానికే ఎసరు పెడతాడా? అయినా కాంత, ఏమీ పసిపిల్ల కాదు-తన జ్ఞానం తనకి ఉండవద్దూ? సుందరం గాడు వయసులో తనకంటె చిన్న కూడా! అయినా కామం కన్నుగప్పినప్పుడు వయసు వరుసల విచక్షణ ఏముంటుంది? ఈ వ్యవహారం ఎంతకాలంగా సాగుతూందో? తానిప్పుడు ఊళ్లో లేనందువల్ల పైబడిందేమో?

ఏమో ఇదంతా అబద్ధం ఎందుకు కాకూడదూ? అయితే తాను [illegible]



# అటూ - ఇటూ



ఆవిడ వరలక్ష్మమ్మగారు చెప్పినట్టు ఇది వరకు తానున్నప్పటిలాగే వాడు సుందరం వచ్చిపోతూ ఉండవచ్చును. దానినే కిట్టని వాళ్ళు చిలవలు పలవలు కల్పించి ఇలా పెంచి ఉంటారేమో?

అయినా అప్పుడు శాంత తనతోపాటు ఉద్యోగానికి శెలవుపెట్టి వచ్చేస్తానంది. "వాళ్ళు మీరున్న ఊరికే బదిలీచేస్తే మంచి మాట. లేకపోతే ఉద్యోగం మానేస్తాను గాని, వేరే ఉండనంది—తానే బోధ పరిచేడు. ముందుగా శెలవుపెట్టి, శెలవులో ఉండగానే బదిలీచేయమని కోరితే అధికారులకు కోపంవస్తుందనీ, నెమ్మదిగా పట్టు దలగా ప్రయత్నిస్తే తప్పకుండా వాళ్లే న్యాయం ఆలోచించి ఇద్దర్నీ ఒకేచోటికి వేస్తారని నచ్చజెప్పేడు. అప్పటికీ శాంతకు అంతగా ఇష్టంలేదు.

అటువంటి శాంత ఈ రెండు మూడు నెల్లోనూ ఇంతలా మారిపోయివుంటుందా? ఏమో, ఎవరు చెప్పగలరు? ఎప్పుడయినా మార్పువచ్చేది కొద్దిక్షణాల్లోనే కదూ?

కాని, ఇప్పుడు తాను వెళ్ళినందువల్ల పరిస్థితి అంతా చక్కబడుతుందని ఏమిటి నమ్మకం? తన ఎదుట వాళ్లు మామూలుగానే ఉండవచ్చును. అసలు తను ఈ అనుమానాన్ని బైటపెట్టడం ఎలాగ? నిజమోకాదో తెలుసుకోవడం ఎలాగ? తాను బయలుదేరి నప్పుడు అనుకున్నట్టుగా ఆమెచేత శెలవు పెట్టించి తనతో తీసుకుని వెళ్ళినంత మాత్రంలో ఈ సంశయం నివృత్తికావడం ఎలా? అంతకంటె తాత్కాలికంగా ఎంత కష్టమయినా తన అనుమానం నిజమేనని ఋజువయిపోవడం మంచిది.

ఇప్పుడు తాను వెళ్లడం తిన్నగా ఇంటికి వెళ్లకుండా ఊళ్లో నెవ్వరింటి రహస్యంగా వాళ్ళ ప్రవర్తనను కనిపెట్టితే? అది సాధ్యమవుతుందా? ఊళ్ళో అందరూ తనకు తెలిసినవాళ్లే. ఎవరికీ తెలియకుండా ఎలా ఉండడం?

ఎలా ఉండడం అంటె లాభంలేదు. ఎలాగో వీలు చేసుకోవాలి. ఎవరికంటా పడకుండా తన యింటిని తానే దొంగలాగ సమీపించాలి. గూఢచారుడిమాదిరిగా పరిస్థితి అంతటినీ ఆకళింపు చేసుకోవాలి. అవసరమయితే మరి నాలుగురోజులు శెలవు పొడిగించి ఇదేదో నిస్సంశయంగా తేల్చుకోవాలి. ఇక్కడ ఇంటిదగ్గరే అయితే నలుగురికంటా పడతామేమోనని బెదురుగా ఉండవచ్చును. అందుచేత వాడు సుందరంగాడి బసమీద కూడానిఘా ఉంచాలి లేక అదీఅంత మంచి స్థలం కాదేమోనని ఇంకేదయినా సమావేశస్థలం ఏర్పాటయి ఉందేమో అదీ తెలుసుకోవాలి ఇటువంటి విషయాల్లో వెంకటేశ్వర్లులాటి వాడు గొప్పగా పనిచెయ్యగలడు గాని, మొత్తానికి ఏమీ లేకపోతే చాలా అవమానముగా వుంటుంది. వాడూ ఊరుకునేరకం కాదు. అడిగిన వాళ్లతోనూ అడగనివాళ్ళతోనూ బహిరంగరహస్యంగా చెప్పేస్తాడు. ఇటువంటి పరిస్థితిలో ఎంత ఆప్తుల సహాయమూ పనికిరాదు, అంతా స్వయంగా నడిపించవలసిందే.

రైలు మామూలుకంటె ఒక గంటన్నర లేటుకావడమూ మంచిదే అయింది. తమ ఊరు స్టేషను చేరుకొనేసరికి రాత్రి ఎనిమిది న్నర అయింది. ఇప్పుడైనా స్టేషనులో ఎవరూ తెలిసినవారు కనబడకుండా ఉండాలి. కనిపిస్తే తాను వేసుకున్న పథకం అంతా భగ్నమవుతుంది. ఇంతవరకూ బాగానే ఉంది. రైలులో తమ ఊరివాళ్లెవరూ తారసపడలేదు. రైలు ఆగగానే కాకుండా, బయలుదేరి పోయేవరకూ ఆగి, అప్పుడు ఎవరికంటా పడకుండా చల్లగా జారుకోవాలి.

స్టేషను ఘట్టంకూడా అనుకున్న ప్రకారమే సాగిపోవడంతో కాంతారావుకుకొంత నిబ్బరం కలిగింది. ప్రయాణీకుల కోలాహలం అణగిపోయి, స్టేషను ప్రాంతం నిశ్శబ్దంగా ఉంది. ఒకటి రెండు జట్కాలు కంటె ఎక్కువలేవు. కొద్దిగా రిక్షాలుకూడా మిగిలిఉన్నాయి. తనకు రిక్షామీద వెళ్లడమే అలవాటయినప్పటికీ, నాడు మాత్రం కాంతారావు జట్కామీదనే ఊళ్లోకి బయలుదేరేడు. జట్కాలో కూర్చున్నా, తెలిసినవారెవరైనా గుర్తిస్తారేమోనని, పైమీద వాణీకప్పుకొని మరీ కూర్చున్నాడు.

తమ వీధి మొగను, జట్కా దిగిపోయి, జట్కామనిషికి డబ్బులిచ్చి, పంపించేసేడు. ఒక్కమనిషి తను చెప్పిన బేరానికి ఒప్పుకొని ఏమీ పేచీపెట్టకుండా డబ్బులివ్వడం, అసలే బేరం దొరకదేమో అని భయపడిన జట్కామనిషికి, చాలా సంతోషం కలిగింది. హుషారుగా ఈలవేసుకుంటూ జట్కాను స్టేండువైపుకు మళ్లించేడు. జట్కా ఇంటికి కనిపించినంతవరకూ అటే చూస్తూ నిలబడి పోయేడు కాంతారావు

మళ్ళీ తన కింకర్తవ్యతా విమూఢత తన్ను ఆక్రమించుకొంది. సరిగా వంద గజాలుకంటె ఎక్కువదూరంలేదు తన ఇల్లు. తనఇంటికి—తన హృదయేశ్వరి శాంతవద్దకు వెళ్ళడానికి తనకు సంకోచం పట్టుకున్నది ఇప్పుడు. ఇదివరలో ఇలా జరుగుతుందని ఎవరైనా జోస్యం చెప్పిఉంటే నమ్మడం అసాధ్యమయి ఉండేది తనకు.

ఇప్పుడు తాను ఇంటికి వెళ్లేసరికి శాంత ఒక్కర్తే ఉంటే తన అనుమానం నిరాధారమైనట్టేనా? ఆ దెబ్బ కుదురుతుంది ఈ ఒక్కనాటి మంచితనం, గతకాలంలోని దుష్ప్రవర్తనను తుడిచివేయజాలదుకదా?

తనకిప్పుడున్నవి రెండు దారులు: ఒకటి, వాళ్ళ దుర్నడతను, తనకళ్లతో తాను చూసి, పట్టుకోవడము. రెండు, వాళ్ళను వారం, పదిరోజులు కనిపెట్టి ఉండి, వాళ్లలో ఏదోషమూ లేదని నిశ్చయానికి వచ్చి అప్పుడు శాంతను తనతో తీసుకొని పోవడము.

సరే ఇదంతా ఇదివరకు ఆలోచించినదే, ఇక్కడ ఇలా నిలబడిఉండడంవల్ల ఏం ప్రయోజనం? ఈ వీధిలో అందరూ తనకు తెలిసినవాళ్ళే. ఎవరికంటైనా పడవచ్చు. అందుమూలంగా తన పథకం నెరవేరడానికి ఆటంకాలు కలుగుతాయి. అందుచేత కార్యక్రమం, చకచక సాగించాలి.

ముందుగా ఇంటిని గమనించి తరువాత అవసరమైతే వాడి బసని పరిశీలించడం,— ఆతరవాత సంగతి అప్పుడే నిర్ణయించుకోవచ్చు.

ఇల్లు దగ్గరపడుతున్నకొద్దీ కాంతారావుకి తనను వెనకనుండి ఎవరో బలవంతంగా లాగుతున్నట్లు అనిపించింది. పాదాలు నేలను తగులుతున్నట్టు లేదు. ఫిబ్రవరినెల కావడాన, ఇంకా చలి కొంచెం ఉంటునేఉన్నా మొగం అంతా చెమటతో తడిసిపోయింది. తన ఈ అసమర్థతతో లక్షణాలకు తనమీద తనకే చాలాకోపం వచ్చింది ఇప్పుడే ఇంతకంగారు పడితే, ముందుముందు ఎలా నిగ్రహించుకు రాగలడు.

మొగం తుడుచుకొని ఎలాకావలసిఉంటే అలా జరుగుతుందని, మనస్సుని కుదుటపరచుకొని తబ్బిబ్బుపడకుండా నడిచిపోవాలని నిశ్చయించుకొని నాలుగు అడుగులు వేసేడోలేదో ఎదురయ్యేడు నాగేశ్వరరావు వాడేదో పరధ్యానంగా ఆలోచించుకుంటూ సాగిపోవడంవల్ల కాని, లేకపోతే తను మొగం దించుకొని వంగి నడిచినంతమాత్రంలో గుర్తుపట్టలేక పోయేవాడు కాదు

తమఇంటికి దగ్గరగా ఎలక్ట్రిక్ దీపం

(53-వ పేజీ చూడండి)




# 30

మధ్యాహ్నం రాణాఘాట్ స్టేషన్‌లో రైలుమారారు. అపూ కళ్లల్లో రెండుసార్లు రైలుబొగ్గు నలకలుపడ్డా, వాడు రోజల్లా కిటికీలోంచి ముఖం బయటికి పెట్టి చూస్తూ కూర్చున్నాడు. స్టేషన్ స్టేషన్‌లో ఉన్న వాటి నేమంటారు? సిగ్నళ్లా? అవి వాలుతూ, పైకి లేస్తూ ఉంటాయి ఎందుకు? రైలు ఆగేచోట్లల్లో-అరుగుల్లాగా ఎత్తుగా కట్టిన రాతికట్టడాలు...వాటిని ప్లాట్‌ఫారం అంటారా? కొయ్యచెక్కల మీద ఇంగ్లీషులోను, బెంగాలీలోను అన్ని స్టేషన్ల పేర్లూ పెద్ద పెద్ద అక్షరాలతో రాసి ఉన్నాయి - కుడల్ గాఛి, గోవిందపూర్, బాన్పూర్. రైలు బయలుదేరబోయేముందు గంట మ్రోగుతుంది. టంగ్, టంగ్, టంగ్, టంగ్ - నాలుగు దెబ్బలు. అపూ లెక్కపెట్టాడు. ఒక పెద్ద ఇనుపచక్రానికి చుట్టూ పిడులున్నాయి. వాటిని త్రిప్పితే సిగ్నల్ పడుతుంది - కుడల్ గాఛి స్టేషన్‌లో అపూ స్పష్టంగా గమనించాడు...

సర్వజయ ఈ దఫాతో మొత్తం రెండు సార్లు ఎక్కింది రైలు. మొదట యెప్పుడో కాలంనాడు-అప్పు డాయన కాశీనుంచి కొత్తగా వచ్చి కాపురం పెట్టారు-జ్యేష్ఠ మాసంలో ఆడంఘాటాలో వి-యుంగళ కిశోర్ దేవుణ్ణి చూడటానికి వెళ్ళింది. అది ఇప్పటి మాటా? ఆమె ఎంతో ఉత్సాహంతో ప్రతి స్టేషన్‌లోనూ ఎక్కే దిగే జనాన్ని తొంగిచూస్తోంది - ఆడవాళ్లా ఎక్కుతున్నారో, దిగుతున్నారు. వాళ్ల ముఖాలు, వాళ్ల చీరెలు, నగలు, ఎలా ఉన్నదీ గమనిస్తోంది. జగన్నాథ్‌పూర్ స్టేషన్‌లో నుంచి మరమరాల ఉండలు అమ్ముతూ ఉండటం చూసి, కొడుకుతో "అపూ! మరమరాల ఉండలు తింటావురా? నీ కిష్టంగా, కొనిపెట్టనా?" అన్నది.

స్టేషన్‌లో టెలిగ్రాఫ్ తీగమీద ఏదో పక్షి ఊగుతూ కూర్చుంది. అపూ దాన్ని ఎగాదిగా చూసి చూసి, వ్రేలితో చూపిస్తూ "అమ్మా, చూడు, ఎవరి ఇంట్లో పంజరంలో నుంచో మైనా పారిపోయి వచ్చింది" అన్నాడు.

నైహాటీ స్టేషన్‌లో రైలుమారి, గంగానది వంతెనమీది నుంచి, రైలు వెడుతూండగా సూర్యుడు అస్తమిస్తున్నాడు. సర్వజయ కన్నార్పకుండా చూస్తోంది. అద్దరినుంచి గాలి రయ్యిన కొడుతోంది. గంగానదిలో పడవలు, రెండు వైపులా చక్కటి యిళ్లు, తోటలు—ఇలాంటి దృశ్యాలు జీవితంలో చూడలేదామె. కుర్రవాడికి చూపిస్తూ

అనువాదం:
మద్దిపట్ల సూరి

"చూశావురా అపూ! అదుగో పాగోడ" అన్నది తర్వాత చేతులు రెండూ శిరస్సున గీలించి, 'తల్లీ! గంగాభవానీ! నీ మీదుగా వెడుతున్నాం; తప్పు ఎంచకు తల్లీ! కాశీ వెళ్లాక మారేడుపత్రి, మందారపూలతో నిన్ను పూజిస్తాను. అపూని కాపాడు తల్లీ, ఎందుకు వెడుతున్నామో అది నెరవేరేట్టు చెయ్యి, అక్కడ ఆశ్రయం దొరికేట్టు చెయ్యి తల్లీ!' అని ప్రార్థించింది.

ఆనందంతో, గగుర్పాటుతో, అనిశ్చితత్వంలోని నిగూఢతతో ఆమె హృదయం రెపరెప లాడుతోంది. ఇలాంటి మనఃస్థితి ఇతఃపూర్వమెప్పుడూ ఆమెకి అనుభవం కాలేదు. మంచికాని, చెడుకాని-ఇలాంటి విముక్త జీవితానందం తొలిసారిగా చవి చూడటం ఇవాళే వెదురుతోపులో నాలుగు దళ్ళ మధ్య స్వల్పపరిధిలో గడిచిన తన చిరకాల గ్రామజీవితంలో, ఇలాంటి సచల దృశ్యాలు, ఒక రకమైన అభినవగతి వేగం, ఇంత అపురూప రోమాంచము తోటి సన్నిహిత పరిచయం ఆమెకి ఎన్నడూ కలగలేదు. చుట్టూ గోడలు నిర్మించుకుని తనకుతానే సంకుచితం చేసుకున్న ఆ కుడిగుడి కుంచపు జీవితం వెళ్ళిపోయింది, వెళ్ళిపోయింది...ఆ పశ్చిమదిశను అస్తమిస్తున్న సూర్యునిమీదనే దృష్టి నిలిపి, నదీనదాలను, దేశదేశాలను దాటి వెళ్ళిపోతోంది. ఈ దాటి వెళ్ళిపోవటంలోని వాస్తవికత ప్రత్యణువూ అనుభవంలోకి వస్తోందివాళ. ఏడాది క్రితంకూడా నిశ్చింది పురంలోని యింట్లో పడుకుని ఎన్నో రాత్రులు, వీలైతే ఒకసారి చాక్‌దా కాని, కాలీగంజ్ గాని గంగాస్నానానికి వెళ్లి వస్తే బావుండునని ఎంత ఆలోచించింది. అప్పుడది అసాధ్యమయినదని తోచింది. కాని ఇవాళ!

బ్యాండేల్ స్టేషన్‌కి రైలు ఇంకా సేపటికి వస్తుందనగా, ఎదురనున్న పెద్ద లైను మీదినుంచి, ఓ పెద్దరైలు గుప్‌గుప్ మంటూ వెళ్లిపోయింది. అపూ విస్తుపోతూ అటే చూస్తూకూర్చున్నాడు. ఎంత ధ్వని! బ్యాండేల్ స్టేషన్‌కి రాగానే వాళ్లు రైలుదిగారు. ఇటూ అటూ ఇంజన్లు పరుగెత్తుతున్నాయి. పెద్ద పెద్ద గూడ్సు రైళ్లు స్టేషన్ని గజగజ లాడిస్తూ అయిదు నిమిషాలయినా వ్యవధి లేకుండా వెళ్లిపోతున్నాయి.

ఇటూ-అటూ ఇంజన్ల కూతలతో చెవులు దిబ్బెళ్లు పడుతున్నాయి. అటునుంచి ప్యాసింజరు రైలొకటి బయలుదేరింది; గార్డు పచ్చజెండా ఊగిస్తున్నాడు. సందె వేళ-స్టేషన్‌కు తూర్పు-పడమరల లైనులనిండా లెక్కలేనన్ని సిగ్నల్సు, వాటి ఎర్రదీపాలు పచ్చదీపాలు కళ్లకు జిగేల్‌మంటున్నాయి-రైళ్లు, ఇంజన్లు, గూడ్సులు, జనం...

**జరిగిన కథ:—**

నిశ్చిందిపురం బెంగాల్‌లోని మారుమూల కుగ్రామం. ఆ ఊళ్లో చితికిపోయిన మధ్య తరగతి సంసారి హరిహరరాయ్. అతని భార్య సర్వజయ. కూతురు దుర్గ. హరిహరరాయ్ పెళ్ళయిన తర వాత కొంతకాలం దేశాలు పట్టిపోయి, శాస్త్రాలు, కావ్యాలు చదివి పండితుడై, పదేళ్ళకి తిరిగివచ్చి కాపరంపెట్టాడు. దుర్గ పుట్టిన చాలఏళ్ళకి అతనికి కొడుకు పుట్టాడు. వాడిపేరు అపూ. ఇంట్లో ఎప్పుడుచూసినా 'ఇవాళ ఎలా గడుస్తుందిరా భగవంతుడా' అనే చింతే. కాని పిల్లల కిదేం పట్టింది? దుర్గకి ఒక్కనిమిషం ఇంట్లో కాలు నిలవదు. ఎప్పుడూ ఏ తోటలోనో, ఏ చెట్టుకిందనో ఆడుకుంటూ ఉంటుంది. అపూ ఎప్పుడూ ఊహాలోకంలోనే గడుపుతాడు. వాడికి ప్రతిదీ కొత్తే. ప్రతిదీవింతే. వాడి జీవితపరిధిలోకివచ్చే ప్రతి సాధారణవిషయమూ అసాధారణమైనదిగా, అద్భుతమైనదిగా వాడికి కని పిస్తుంది. బడి చదువుకూడా వాడికి ఏమీ అంటలేదు. ఇంట్లోనే తండ్రికొలూాకు పుస్తకాలన్నీ చది వేస్తూ ఉండేవాడు. ఒకసారి వాళ్ల ఊళ్లోకి ఒకనాటక సమాజం వచ్చింది. వాళ్లువేసిన నాటకాలు చూసి అపూ తన్మయుడైపోయాడు. తనుకూడా పెద్దయ్యాక నాటక సమాజాల్లోచేరి నటుడైపోవా లని కలలు కన్నాడు. తను చూసిన నాటకం కథ ఆధారంగా స్వయంగా ఒక నాటకంకూడా రాసే శాడు. మొత్తానికి వాడి ఆదర్శాలకు ఆకాశమే అవధి. దుర్గకి మంచి సంబంధం ఏదన్నా చెయ్యా లని తల్లి ఆవేదన పడేది. కాని మంచిసంబంధాలనేవి హరిహరరాయ్ కుటుంబానికి ఎన్నటికీ అందని ప్రమానిపండ్లే. ఎప్పుడో ఏదో అదృష్టం కలిసివచ్చి తమ సంసారం బాగుపడుతుందనీ, దుర్గ గొప్ప ఇంటి కోడలైపోతుందనీ, అపూ పెద్దవాడై ప్రయోజకుడై తమ కష్టాలు గట్టెక్కిస్తాడనీ ఆమె కలలు కనేది. కాని ఆ కలలు కల్లలుగానే మిగిలిపోయాయి.

ఒకసారి దుర్గకి జ్వరం పట్టుకుని ఎన్నాళ్ళకీ తగ్గలేదు. హరిహరుడు ఊళ్ళోలేడు. తల్లీ, పిల్లలూ తిండికికూడా మొహం వాచిపోయారు. ఆఖరుకి ఒక భయంకరమైన రాత్రివేళ, వర్షం ప్రళయంగా కురుస్తున్నవేళ దుర్గ ప్రాణవాయువులు అనంతంలో లీనమైనాయి. ఆమె జనన మరణ, సుఖదుఃఖ ద్వంద్వాతీతమైన ఏదో అజ్ఞాతలోకానికి వెళ్లిపోయింది. హరిహరుడు ఊరినుంచి తిరిగి వచ్చినతరవాత గాని దుర్గ మరణం వార్త అతనికి తెలియలేదు.

## ★ పథేర్ పాంచాలి ★

రాత్రి కొత్త ప్రొద్దుపోయాక వాళ్ళ కాశీ రైలు వచ్చి ప్లాట్‌ఫారంమీద ఆగింది. విశాలమైన స్టేషన్, అంతులేని జనం, సర్వ జయ దిమ్మెరపోతోంది, ఆ గుంపులో నలిగి పోతూ, అలవాటులేని, మొద్దువారిన పాదా లతో భర్త వెనుక వెనుకనే నడుస్తూ, ఓ పెట్టె కమ్మందుకువచ్చి ఉంచోగానే, హరిహరుడు ఎలాగో ఆ గుంపును త్రోసు కుంటూ, జడిసిపోతున్న భార్యను, దిమ్మెర పోయిన కొడుకునీ, రైల్లోకి ఎక్కించి, బెంచిమీద కూర్చోపెట్టి, కూలివాళ్ళ సహా యంతో మూటలూ అవీ లోపలకు చేర వేశాడు.

తెల్లవారగట్లకి సర్వజయకి మైకం వదిలి పోయింది. రైలు వాయువేగంతో పరుగెత్తు తోంది - మైదానాలని, చెట్లని, భూమిని 'మమైకం' చేస్తూ పరుగెత్తుతోంది. రాత్రి రైలు కదా అని అందరూ ఒక పెట్టెలోనే ఎక్కారు - హరిహరుడామెని ఆడవాళ్ళ పెట్టెలో ఎక్కించలేదు. రైల్లో గుంపు మొదట ఉన్నదానికంటె తగ్గింది. ఒకొక్క బెంచీమీద ఒకొక్కరు చాచుకు పడు కున్నారు. పై బల్లమీద ఓ కాబూలీ మనిషి గుర్రు కొడుతున్నాడు. అపూ ఎప్పుడు లేచాడో కిటికీలోంచి ముఖం బయటికి పెట్టి నోరు తెరుచుకు చూస్తూ కూర్చున్నాడు.

హరిహరుడు మెలుకువ వచ్చి లేచి, "అలా బయటికి చూస్తూ కూర్చోకురా, బొగ్గు రవ్వలు పడతాయి కళ్ళల్లో" అన్నాడు కొడుకుతో.

బొగ్గు రవ్వలదేముంది? అవేటే అంత ప్రమాదం లేనివి. కళ్లురెండూ ఊడి పడి పోయినా సరే, కిటికీలోంచి చూడకుండా కూర్చోటం మాత్రం వాడి కసాధ్యమయిన సంగతి. అపూ ఇంచుమించు రాత్రంతా అలాగే కదలకుండా కూర్చున్నాడు. అమ్మా నాన్నా అంతే నిద్రపోతున్నారు, కాని తానెన్నెన్ని చూశాడు! ఎన్ని స్టేషన్లలోనో రైలు ఆగలేదు. దీపాలు, జనంతో సహా ఆ స్టేషన్లు తుస్సుమని పోయే తారాజువ్వలా ఎలా తప్పుకుపోయాయి! ఓ రాత్రివేళ ఎప్పుడో కొత్త నిద్రమత్తు వచ్చిందివాడికి. హఠాత్తుగా మెలుకువరాగానే ముఖం బయటికి పెట్టి చూశాడు. అర్ధరాత్రి వెన్నెల్లో ఏదోనది వంతెనమీదినుంచి రయ్యిన పరుగెత్తుతోంది రైలు. ఎదుట పెద్ద ఎత్తయిన నల్లటి దిబ్బ, ఆ దిబ్బనిండా రక రకాల చెట్లు, వెన్నెలపడి నదిలో నీళ్లు తళ తళలాడుతున్నాయి. పైన ఆకాశంలో గూడిపింజాల్లా తెల్లటి మబ్బుతునకలు— తర్వాత మళ్ళీ అలాంటివే మరికొన్ని

దిబ్బలు—వాటినిండా అలాగే చెట్లు...ఆ తర్వాత ఓ పెద్ద స్టేషను, దీపాలు, జనం—ప్రక్క లైను మీదికి ఓ రైలువచ్చి ఆగింది. పాన్‌బీడా అమ్మేవాడితో ఎవరో ఓ ప్రయాణీకుడు పెద్ద పోట్లాట పెట్టుకున్నాడు... స్టేషన్‌లో పెద్ద గడియారం ఒకటుంది. తన మాష్టారు నరేన్‌బాబు దగ్గిర గడియారం ఎలా చూడాలో నేర్చుకున్నాడు అపూ-సరీగ్గా గుణించుకుంటూ చూశాడు. మూడు ఇరవై నిమిషా లయింది. తర్వాత రైలు మళ్ళీ బయలుదేరింది. మళ్ళీ ఎన్ని చెట్లు, ఎన్నెన్ని పెద్ద పెద్ద దిబ్బలు...చాలచోట్ల రైలు రోడ్డుకి రెండువైపులా ఉన్నాయి దిబ్బలు. రైల్లో అందరూ నిద్రపోతున్నారు. వీళ్ళంతా ఏమీ చూడలేనివాళ్ళు ఎందుకో రైలెక్కటం! ఆ దిబ్బలన్నీ ఏమిటని ఎవరిని అడుగుతాడు తాను? ఒకోకసారి వాడు కిటికీలోంచి ముఖం బయటికి పెట్టి, క్రింద నేల కేసి చూస్తూ రైలు ఎంతవేగంగా పోతున్నదీ కనిపెట్టటానికి ప్రయత్నించాడు. జుట్టంతా గాలికి లేగిపోయి ముఖంమీద పడుతోంది. క్రింద నేలకన్పించటంలేదు, ఏవో గీతలు గీతలుగా కన్పిస్తోంది. ఓః! ఎంత గబగబా పరుగెత్తుతుంది రైలు! కుతూహలంతో, కంగారులో అపూ ఓసారి ఈ కిటికీదగ్గిరకి, ఓసారి ఆ కిటికీదగ్గరకువెళ్ళి ముఖం బయటికి పెట్టి చూడటం మొదలెట్టాడు.

మధ్య మధ్య తూర్పువైపుగా చటుక్కున విరిసి మెరిసిపోతున్న వెన్నెల పరిచిన మైదానం కేసి చూస్తూంటే—"ఎంతదూరంవచ్చాం! ఏ దేశంలో మిట్టపల్లాల మైదానాలమీదుగా పోతున్నాం మనం!" అనిపించేది:

తెల్లవారబోయేముందు మళ్ళీ కాస్త నిద్రమత్తు వచ్చింది వాడికి. ఓ పెద్ద స్టేషన్‌లోకి రణగొణధ్వని చేసుకుంటూ రైలువచ్చి ఆగేసరికి ఆ మత్తుకాస్తా ఎగిరి చక్కా పోయింది. ప్లాట్‌ఫారంమీద రాతిపలకమీద 'పాట్నా సిటీ' అని రాసిఉంది.

తర్వాత మళ్ళీ ఇంకా ఎన్నో స్టేషనులు దాటిపోయాయి: అరె! ఎంత పెద్దవంతెనో! రైలు నడిచింది నడిచినట్లే ఉంది. వంతెనమాత్రం ఆఖరయేట్లు లేదేఅనిపించింది. ఎన్ని సిగ్నల్సు, ఎన్ని మరలకార్ఖానాలు; ఓ స్టేషన్‌గదిలో ఒక రైల్వేఉద్యోగి ఓ ఇనుప స్తంభంలాంటి దానిమీద ఓ గొట్టంలా ఉన్న దాని ముందు ముఖం పెట్టి, ఎవరితోనో మాట్లాడుతున్నాడు. 'ప్రైవేట్ నంబరా! అహాఁ సరే, సిక్స్‌నైన్. సిక్స్‌నైన్; అఁ. అరవై తొమ్మిది—అఁ. అఁ,'

అపూ విస్తుబోయి తండ్రిని అడిగాడు—"అది యేంమరనాన్నా? దాని ముందు ముఖం పెట్టి అలా మాట్లాడతాడెందుకు?"

అప్పటికి ప్రొద్దుబాగా ఏటివైపుకి మొగ్గుతుండగా హరిహరుడు, "ఇంక మనం కాశీ

#  పథేర్ పాంచాలి 

చేరుకుంటున్నాం. కుడివైపున నుంచుని చూచాడు, రైలు గంగవంతెనమీదికి వచ్చిందనగానే కాశీ కన్పించటం ప్రారంభమవుతుంది" అని చెప్పాడు.

అపూ చాలాసేపటినుంచి ఆలోచిస్తున్నాడొక సంగతి. దారిపొడుగునా వాడు తంతి తీగెలు, స్తంభాలూ చూస్తూ వచ్చాడు. వాడు జీవితంలో ఈ ఒక్కసారితప్ప ఇంకెప్పుడూ చూడలేదిలా. ఈసారి కనుక మళ్లీ రైలు ఆట ఆడుకునే అవకాశం వచ్చిందంటే—తాను అలాంటి స్తంభాలుపాతి, తీగెలు కడతాడు. ఇదివరదాకా ఎంత పొరబాటైంది!......ఇప్పుడు వెళ్లేచోట తిప్ప తీగెలు దొరుకుతాయికదా!......

* * *

పదిహేనురోజులు గడిచిపోయాయి. 'బాంశ్ ఫటక్ కా' గల్లీలో ఓ ముష్యరకపు మూడంతస్తుల మేడలో, క్రిందిభాగంలో ఒక వాటా అద్దెకుతీసుకున్నాడు హరిహరుడు. పూర్వపరిచితుల చిరునామాలేమీ ఒక్కటికూడా తెలియలేదతనికి. ఇదివరకు వాళ్లు ఉన్న చోటులకల్లా వెళ్లికనుక్కుంటే ఎవరిజాడా తెలియలేదు. ఒక్క విశ్వేశ్వర గల్లీలోమాత్రం - అప్పటి హల్వా కొట్టు రాంగోపాల్ సాహూ ఇప్పటికీ ఇంకా బ్రతికిఉన్నాడు......ఆ ఇంట్లో పైఅంతస్తులో ఓ పంజాబీ సకుటుంబంగా ఉంటున్నాడు. రెండోఅంతస్తులో ఓ బెంగాలీ వ్యాపారస్తుడుంటున్నాడు. బయటగదుల్లో అటిడి కొట్టు, గోడౌనూ ఉన్నాయి. వాటి వెనుకనున్న రెండుమూడు గదుల్లోనే తమ వంటా-పడకా...అన్నీ.

ఈ అయిదారురోజుల్లో సర్వజయ దగ్గరలో ఉన్నచోటన్నీ భర్తవెంట తిరిగి చూసింది. ఆమె కలలోకూడా ఇలాంటి దృశ్యాలెప్పుడూ చూసియెరుగదు-'ఇలాంటి ఆలయం! ఇలాంటి దేముడు.' ఇన్ని ఇళ్లూ-మేడలూ. ఆడంగ్ ఘాట్ లోని జుగల్ కిశోరాలయమే ఆమెదృష్టికి శిల్పకళకి గొప్ప దృష్టాంతంగా కన్పించేది. కాని ఈ విశ్వనాథాలయం! ఈ అన్నపూర్ణాలయం! దశాశ్వమేధ ఘట్టంలోఉన్న ఈ ఎర్రరాతి ఆలయాలు!

ఆమె మధ్యలో ఒకరోజున ఆ పంజాబీ ఆయన భార్యతో కలసి, విశ్వనాథుని హారతి చూసిరావటానికి వెళ్ళింది. అక్కడ ఇదంతా ఎలా ఉన్నదో ఆమెకి చెప్పనలవికాలేదు...... దీపధూపాల పొగలు ఆలయమంతా చుట్టివేశాయి ఏడెనిమిదిమంది పూజారులు కలసి ఒక్కగొంతుతో మంత్రాలు చదువుతున్నారు. ఎంత జనం! ఎంత కోలాహలం! ఎంతమంది ఘరానా స్త్రీలు చూడటానికి వచ్చారు! వారి వేషభూషాదులెంత ఘనంగా ఉన్నాయి! ఎవరో రాణీగారు ఒకావిడ వచ్చింది. ఆమె వెంట నలుగురయిదుగురు దాసీలున్నారు. చాలా ఖరీదైన బనారస్ పట్టుచీర కట్టుకుందావిడ. దాని పెద్ద పెద్ద సరిగపూల అంచు, హారతి-పంచప్రదీపాల వెలుగులో ధగధగ మెరుస్తోంది. ఎంత పెద్ద కళ్లు! ఎంత చక్కని కనుబొమలు! ఎంత కళగల ముఖం ఆమెది! నిజమైన రాణిని ఆమె ఎప్పుడూ చూడలేదు. కథల్లో విన్నది-అంతే. నిజంగా రాణీ చక్కదనమే ఆమెది. ఆమెని ఎక్కువసేపు చూస్తూ నుంచున్నదో, దేవుని హారతినే ఎక్కువసేపు చూస్తూ నుంచున్నదో చెప్పలేదామె.

దేవాలయాలేకాకుండా కొన్ని కొన్ని మేడలూ అవీ ఎలా ఉన్నాయ్... దుర్గోత్సవం భోజనానికి నిశ్చిందిపురంలో గంగూలీగారింటికి వెళ్ళినపుడు, వాళ్ళ దేవతామందిరం, వాళ్ళ రెండంతస్తుల మేడ, వెనుక చెరువు రేవులోదాకా వాళ్లు వేయించుకున్న గచ్చుదారి అవీచూసి, ఆమె ఎంత ఈర్ష్యాన్వితురాలయింది! 'గొప్పవాళ్ళ యిళ్లు ఎంత కళకళలాడుతూంటాయో చూడు...' అని ఓసారి దుర్గతోకూడా అన్నమాట గుర్తుంది ఆమెకి...ఇక్కడిప్పుడు వీధికి రెండువైపులా కన్పిస్తున్న భవనాలముందు గంగూలీగారిల్లు ఎంత?

ఇన్ని గుర్రపుబళ్ళూ అవీ ఒకేసారిగా పోతూ ఉండటం ఆమె ఇదివరకెప్పుడూ చూడలేదు బళ్లుకూడా ఎన్ని రకాలబళ్లు! వచ్చేప్పుడు రాణీఘాట్ లోనూ, నైహాటీలోనూ గుర్రపుబళ్లు చూసింది తాను. కాని ఇన్నిరకాలబళ్లు ఇదివరకెప్పుడూ చూడలేదు. కాసేపు రోడ్డుప్రక్కగా నుంచుని వీటన్నిటినీ చూడాలని ఉన్నదామెకి. కాని మరో స్త్రీ ప్రక్కనుండటంవల్ల అలానుంచోటానికి సిగ్గేసింది...

అపూ సరేసరి! వాడికి ప్రతిదీ ఆశ్చర్యంగానే ఉంది. వాళ్ల యింటికి దశాశ్వమేధఘట్టం ఎంతో దూరంలేదు. రోజూసాయంత్రం అక్కడి వరకూ వెళ్లివస్తూండేవాడు. రోజూ తిరునాళ్లలాగానే ఉంటుందక్కడ. ఇక్కడ భజనలు, అక్కడ పురాణాలు-అక్కడెవరో రామాయణం పారాయణం చేస్తున్నారు: ఎక్కడచూసినా ఒకటే జనం! కలకలలాడే ముఖాలు, కోలాహలం: అపూ తిరిగి తిరిగి అవన్నీ చూసి, చీకటిపడ్డాక ఇంటికి వచ్చి ఆకబుర్లే చెపుతూండే వాడు.

ఎవరి నౌకరో ఓ చిన్న కుర్రాణ్ణిచెయ్యి పుచ్చుకుని రోజూ అక్కడికి వస్తూ ఉండే

వాడు. అపూ, ఆ పిల్లవాడు సావాసులయినారు. ఆ కుర్రవాడి పేరు పచ్చా. మాటలవీ బాగా రావు ఇంకా. చాలా చిలిపి...అంచేతనే ఎక్కడ తప్పిపోతాడో అని ఇంట్లో వాళ్లు ఇలా పహరా ఏర్పాటుచేశారు ఖైదీకిలాగా. అపూ నవ్వలేక ఇదవుతూండేవాడు. నౌకరును ఎంత బ్రతిమాలినా కుర్రవాడ్ని ఒక్క క్షణమైనా చెయ్యి వదిలి రానిచ్చేవాడు కాడు. ఈ ఖైదీ మరీ పసివాడు, అజ్ఞానుడు. అలాంటి వాడి నింత అదుపు పెట్టటంకూడా అంత మంచిది కాదన్న జ్ఞానం లేదు నౌకరికి. రోజూ ఇంటికి రాగానే సర్వజయ అపూని కేకలేసేది—'ఒక్కడివీ ఎందుకలా వెళ్లి తిరుగుతావ్? బస్తీ వీధులాయె! ఒక వేళ ఏదయినా తప్పిపోతే?... తల్లి అనుమానం కేవలం నిరాధారం-అన్న సంగతి ఆమెకి రెండు పూటలా నచ్చచెప్పతూండేవాడు.

కాశీ వచ్చాక హరిహరుని ఆదాయం కూడా పెరిగింది అతడు తిరిగితిరిగి, కొన్ని కొన్ని ఆలయాల్లో నిత్యపురాణ పఠనం ఏర్పాటుచేసుకున్నాడు. అది కాక సర్వజయ ఒకరోజున భర్తని "దశాశ్వమేధఘట్టానికి సాయంత్రమప్పుడు రోజూ ఏదైనా పుస్తకం చంకనిపెట్టుకువెళ్ళి కూర్చోకూడదూ మీరు? ఎంత ఉపాయం ఉంటే వస్తుంది డబ్బు! మీరు ఊరికే కూర్చుని కబుర్లు చెప్పమంటే—"అంటూ పోరటం మొదలెట్టింది. భార్య ఒత్తిడి పెడుతూండటంతో హరిహరుడు 'కాశీఖండం' పట్టుకుని రోజూ దశాశ్వమేధ ఘట్టానికి పోయి కూర్చుంటూ ఉండేవాడు. పురాణపఠనం అతడికేం బ్రహ్మవిద్య కాదు శిష్యుల ఇళ్లలో పూజలు, వ్రతాలు సందర్భాల్లో ఎన్నోసార్లు తాను చేసిన పనే ఇది పుస్తకం తెరిచి అతడు ప్రార్థన శ్లోకం రాగవరుసన చక్కగా

'బర్హాపీడాభిరామా మృగమదతిలకం కుండ
లాక్రాంతగండం............ స్మిత
సుభగముఖం స్వాధరే న్యస్తవేణుం...
......బ్రహ్మగోపాలవేషం...'

పాడటం మొదలెడితే-జనం బాగానే మూగుతూండేవాళ్లు.

ఇంటికి వచ్చాక ఏదో రాసుకుంటూ కూర్చునేవాడు. "ఊరికే ఒట్టి శ్లోకాలు చదువుకుంటూపోతే ఎవరూ వినరు. ఆ బెంగాలీ కథకుని దగ్గర నాదగ్గరకంటె ఎక్కువమంది చేరతూంటారు. రాగవరుసకి అనుకూలంగా కొన్ని కీర్తనలు రాస్తాను హరికథలాగానూ ఉంటుంది-లేకపోతే ఎవరూ చేరరు.

ఆ బెంగాలీ కథకునితో మొన్న మాట్లాడాను. దేవనాగరి అక్షరాలుకూడా రావు. ఆ కీర్తనలూ ఆ కీర్తనలూ పాడి, ఆడవాళ్లను మభ్యపెట్టి డబ్బులు వసూలు చేస్తుంటాడు. నా పళ్లెంలో అరణాలు అర్థరూపాయికంటె ఎక్కువపడవు, అతడి పళ్లెంలో రూపాయికి తక్కువ పడవు... ఎలారాశానో వింటావా కాస్త?" అన్నాడు హరిహరుడు భార్యతో.

కాస్త ఆమెకి చదివి వినిపించాడు. "ఆ కథకుని దగ్గిర పుస్తకంచూసి అడవి వర్ణన రాసుకుందా మనుకుంటున్నాను. ఏం రాసుకోనా?" అన్నాడు.

"మీ రెక్కడ కూర్చుని చెపుతూంటారో చెప్పండి ఓరోజున వినటానికి రావాలి-"

"రారాదూ! దేవీ మందిరం దిగువున కూర్చుంటాను. రేపేరా, క్రొత్తకథ చెపుతాను. రేపు ఏకాదశి-మంచిరోజుకూడా" అన్నాడు హరిహరుడు.

"వచ్చేప్పుడు విశ్వేశ్వర గల్లీలోని దుకాణంలో అబ్బాయికి ఓ అణా జిలేబీ తీసుకురండి. మొన్న మేడమీది ఆవిడ ఏదో పూజ చేసుకుని నన్ను పిలుచుకువెళ్ళి, ఫలారం పెట్టింది. 'పానిఫల్' జిలేబీ. విశ్వేశ్వర గల్లీలో అమ్ముతారుట" తింటూ అనుకున్నాను అబ్బాయికి చాలా ఇష్టంకదా అని. నేను ఆవిడ్ని ఎలా అడిగితీసుకురాను వాడికోసం? ఇవాళ ఓ అణాది కొనుక్కురండి" అన్నది సర్వజయ.

కొన్నాళ్ళ నుంచీ హరిహరుని కథ వినటానికి చాలా మంది జనం వస్తున్నారు. నారదఘాట్ లోని కాళీ ఆలయం దాసీ ఓ పెద్ద తట్ట తీసుకొచ్చి తిన్నగా అపూవాళ్ళ వసారాలో పెట్టింది. సర్వజయ నవ్వు

# ★ పథేర్ పాంచాలీ ★

ముఖంతో- "ఇవాళ పూజరోజు అనుకుంటాను. వారు ఇంటికి వస్తూ ఉంటారు, అవునా?" అన్నది. దాసీవెళ్ళిపోగానే పిల్లవాణ్ణి పిలిచి, "ఇటురారా అపూ! ఇదిగో మాకు కొబ్బరి పువ్వు. నీకు కిస్‌మస్ చాలా యిష్టంగా! అరటిపళ్ళు, ఎంతెంత పెద్ద మామిడిపళ్ళో చూశావా! రా, పెడతాను, ఇలా వచ్చికూర్చో" అన్నది.

ప్రోత్సాహంగా ఉండటంతో హరిహరుడు పాత పుస్తకాల కట్టలన్నీ మళ్ళీ బయటికి తీశాడు. "ధ్రువచరిత్ర విని విని విసుగెత్తిపోయింది వాళ్ళకి, క్రొత్తది ఇంకొకటేదయినా మొదలెట్టరాదూ?" అన్నది సర్వజయ. ప్రొద్దున, మధ్యాహ్నమంతా కూర్చుని, హరిహరుడు జడభరతోపాఖ్యానం కథారూపంలో వ్రాసి తయారుచేసుకున్నాడు. ఇరవైరెండేళ్ళ క్రితం తాను ఈ కాశీలోనే కూర్చుని గీతగోవిందానికి పద్యానువాదం చేసిన సంగతి గుర్తుకు వచ్చింది. అప్పుడు తనకు ఇరవై నాలుగేళ్ళు. స్వదేశానికి వెళ్ళి జీవించవలసి రావటంతో తనంతటతానే పరిణతుడయినాడు. కాశీలో ఉన్నప్పుడు చింతఇదిలేదు. దేశానికి వచ్చాక ఎటుగూసి దాశురాయ్ కీర్తనలు, కవాన్‌జీ కీర్తనలు, గోవింద అధికారి శుకశారికా సంవాదం, మొదలైన వాటికి ఉన్న ప్రచారం - ప్రభావం అతని మనసులో ఒక క్రొత్త మార్పును తీసుకు వచ్చాయి.

రాత్రి భార్యతో మాట్లాడుతూ- "బజారులో మంటపందగ్గర కవితాగోష్ఠి జరుగుతూంటుంది తెలుసా?... నేను ఊరికే ప్రక్కన కూర్చుని వింటూ ఉంటాను... అన్నీ మామూలు పదాలే... కీర్తిమంతమైనవయినా కావు...కొత్త మన సంసారం కుదుటపడి సగానికి రానియ్...క్రొత్తరకం కీర్తనలు రాస్తాను. వీళ్ళంతా పాడేవి మాంధాతలనాటి కీర్తనలు... రాజాతో అదే చెప్పాను నిన్న..." అన్నాడు.

ఒకొక్కప్పుడు హరిహరుడు అర్ధరాత్రిళ్ళు లేచి, వసారాలో ఒక్కడూ ఏదో ఆలోచించుకుంటూ కూర్చునేవాడు. ఏదో తెలియని ఆనందంతో అతడి మనస్సు ఏదో తేలిపోతున్నట్లుండేది.

ఎంత ఉజ్జ్వల భవిష్యత్తు ఎదుట!

మెరుపు దీపాలు వ్రేలాడకట్టిన నాటకశాలల్లో- ప్రతి ఊళ్ళోనూ తన కీర్తనలు తన హరికథలు తన నృత్యనాటికలు. పదాలు రాత్రుల తరబడి గానంచేస్తూ ఉండటం అతడి భావనకి కన్పడుతూ ఉండేది ఎంతెంత దూరం నుంచో ఎందరెందరో వాగులూ, పొలాలు దాటి అన్నం మూటలు కట్టుకుని వచ్చి విని ఆనందిస్తారు: ఆ యా సమాజాల అధిపతులు తన ఇంటికి వచ్చి ప్రతిమాలి పదాలూ-కీర్తనలూ తీసుకు వెడతారు.

అరె! అద్భుతంగా ఉన్నాయే ఎవరు రాసిన పదాలు! కవికులగురువు హారు ఠాకూర్ వ్రాసినవా! కాదు, నిశ్చిందిపురంలోని హరిహరరాయ్ గారు వ్రాసినవి...

ఈ దశాశ్వమేధఘట్టంలోనే కూర్చుని ఇరవై రెండేళ్ళ క్రితం మనస్సులోనే ఎన్నో సగం సగం పదాలు రచించాడు. తర్వాత అవిఅన్నీ ఎప్పుడు మరపున పడిపోయాయో క్రొత్త పుస్తకాలతో క్రిక్కిరిసిన పెట్టెలలో తావులేక ఏ మారుమూలలనో పడి ఉండి, వెలుగుముఖం చూడక మెల్లమెల్లగా చాటుచాటుకు జారిపోయాయో! యౌవన స్వప్నజాలం, ప్రౌఢ వయస్సులో మంచుతెరలాగా భూమ్యాకాశాల అంచుకో విలీనమైపోయింది. దిగజారిపోయిన యౌవనంకేసి పరికించి చూచినకొద్దీ పరిపరివిధాల పోతుంది మనస్సు తీగలాగితే డొంకంతా కదలివచ్చినట్లు- ఎన్నెన్ని జ్ఞాపకాలు కదలివస్తాయి! ఆ గడచిన జీవితంలోని ఒక్క రోజునైనా మరలించి తీసుకు రాలేముకదా!

దశాశ్వమేధఘట్టంలోని చాలామంది పిల్లలతో అపూకి సావాసం అయింది కాని ఇక్కడ తన ఈడుపిల్లలంతా స్కూళ్లలో చదువుకునేవాళ్లే - తానొక్కడే ఇంకా స్కూలుకి వెళ్లనివాడు. నిశ్చిందిపురంలో చేపలు పట్టటంతో, పడవలెక్కి తిరగటంతో రోజులు గడిపితే చెల్లుబాటయింది; కాని ఇక్కడ తన యీడువాళ్ల ముందు తానేమీ చదువుకోలేదని చెప్పటంఅంటే సిగ్గుగా ఉంది

అదీకాక దశాశ్వమేధఘట్టంలో వాడికి సావాసం అయినవాళ్లందరూ కలవారిబిడ్డలు. పట్లా అన్న ఓనాడు ఏదో మాటల సందర్భంలో వాళ్లనాన్న యెప్పుడూ ఊళ్లవెంట తిరుగుతూంటాడని చెప్పాడు. "ఎందుకని? మీకు శిష్యులయిళ్లు చాలా ఉన్నాయా?" అని అడిగాడు అపూ. పట్లా అన్న ఆశ్చర్యపోతూ -"శిష్యులయిళ్లా? ఎవరికి భాయీ?" అన్నాడు.

అపూ సరిగ్గా సమాధానం చెప్పేలోపుగానే- "మా నాన్న కంట్రాక్టరుకదా; అదీకాక 'కాంథి' పరగణాలో మాకో చిన్న జమీందారీ ఉంది - అయినా ఈ రోజుల్లో శిష్యులిచ్చే వాళ్లెవరున్నారు?" అన్నాడతడు.

ఒకొక్కరోజున సాయంకాలం దశాశ్వమేధ ఘట్టానికి వెళ్ళినప్పుడు అపూ, తండ్రి పురాణం చెప్పటం వింటూ ఉండేవాడు. హరిణ శిశువు బోయవానిచే చంపబడగానే, దానియెడ మమకారంకల రాజర్షి భరతుని విరహవ్యథ- తర్వాత ఆయన మృత్యుగాథ 'శీతలా మందిరం' సోపానాలమీద కూర్చుని వింటూంటే వాడికి కళ్లు చెమర్చేవి. ఇటు మళ్ళీ సింధు సౌవీరరాజు ఆయన మహాత్వం తెలుసుకోలేక బ్రహ్మర్షి భరతుని పల్లకీబోయిగా నియోగించాడని విన్న దగ్గర్నుంచీ కుతూహలంతో ఉత్కంఠతో వాడి గుండె గుబగుబలాడేది. ఇంకేముంది, ఈసారి ఏదో ముంచుకు రాబోతోంది అనిపించేది మనసుకి. కథ చివరిస్వస్తి వాచకం గాఢకంఠంతో వింటూగా వుండేది.

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ
లోకాః సన్తు నిరామయాః...

సాయంత్రమప్పుడు ఆలయం ఆలయంలోని శంఖఘంటాధ్వనులతో అస్తభానుని అరుణ కాంతులు, పూరవీ రాగప్రస్తారంలో హరిణ శిశువుకై వియోగబాధ ననుభవిస్తున్న రాజర్షి వ్యథ మిళితమైనట్లుంటాయి.

ఇంట్లో కలం కాగితం తండ్రి దగ్గరకు తీసుకెళ్లి "నువ్వు చదివావే" కాలే వర్షతు పర్జన్యః..."నాకు రాసి పెట్టవ్ నాన్నా?" అని అడిగాడు అపూ.

హరిహరుడు పులకితుడై "నువ్వు విన్నావా యేం రా?" అని అడిగాడు.

"నేను రోజూ అక్కడికి వస్తున్నాను. నిన్న నువ్వు భరతుని తల్లి చని పోవటం

చెపుతున్నప్పుడు నేను నీ వెనకాలే ఆలయం మెట్లమీద కూర్చుని ఉన్నాను."

"నీకెలా వుందిరా? బాగుందా?"

"బా...బా...బావుంది. నేను రోజూ వింటాను—"

కాని అపూ ఒక సంగతి మాత్రం దాచాడు. సావాసగాళ్లు ప్రక్కనున్నప్పుడుమాత్రం వాడు తండ్రి కూర్చుని ఉన్నవైపుకి వెళ్లడు. ఓనాడు తండ్రి ప్రక్కనుంచి వెడుతూంటే, అతడు చూసి, 'ఒరేయ్...' అని పిలిచాడు.

"నిన్ను ఎరుగునా యేం?" అని అడిగాడు ప్రక్కనున్న స్నేహితుడు. అపూ 'ఊఁ' అని తలమాత్రం ఊగించాడు. ఆ రోజున తండ్రిదగ్గరకు రాలేదు వాడు...తన తండ్రి గంగ ఒడ్డున పురాణం చెపుతూంటాడని స్నేహితులకు ఎక్కడ వెల్లడి అయిపోతుందో అని—అపూ పట్టా అన్నతో తప్ప మిగిలినవాళ్ళందరితో 'మాకు ఇక్కడ స్వంత ఇల్లు ఉంది. మేమిక్కడకి గాలిమార్పుకై వచ్చాం. మా ఊళ్లో పెద్ద మేడ ఉన్నది మాకు, మా నాన్న కంట్రాక్టరు, అదీకాక మాకు అక్కడ జమీందారీ కూడా ఉంది—కాని ఉంటే ఏం లాభం! శిస్తులు చెల్లించేవా ళ్ళెవరుంటారు?' అని కల్పించి చెప్పాడు.

వాడి సావాసగాళ్లు వాడికంటె అట్టేపెద్దవాళ్లు కాకపోవటం వలన—వాడు చెప్పిన దానికీ, వాడి వేషభాషలకు మధ్యనున్న తారతమ్యం పట్టుపడలేదు. ముఖ్యంగా వాడి అందమైన ముఖం ఇలాంటి లోపాల్ని ఎన్నిటినయినా కప్పిపుచ్చగలదు.

పూర్ణిమరోజున బెంగాలీ కథకునిదగ్గిర చాలామంది జనం మూగారు. సందెపడ్డాక పారిహారుడు కథముగించి, ఆ ఘట్టంలోని మెట్లమీద విశ్రాంతి తీసుకుంటూకూర్చున్నాడు. ఆ కథకుడు కాళ్లూ చేతులూ ముఖం కడుక్కోటానికి రేవులోకి దిగాడు. పారిహారునిచూచి, "ఆ మీరున్నారూ ఇక్కడ, చూశారుగా ఇది. పూర్ణిమ ఇవాళ. చాలా మంచిరోజు. 'వామన భిక్షు' పర్వదినం కూడా ఇవాళ. మునుపు ఈ వామనభిక్షు పర్వదినం వచ్చిందంటే—దాదాపు అర్ధమణుగు బియ్యం దొరికేవి. కాని ఈ రోజులలో మహా వామనభిక్షు వచ్చినా, జనం మూగరు. చారెడు బియ్యం అయినా రాలేదనుకోండి. అయితే ఇక్కడరూపాయి పావలా రొఖ్ఖం మాత్రం దొరికింది. అందులో మళ్ళీ రెండు నూరని పత్తుబేసలు. తమరి శిక్షణ ఎక్కడ?" అన్నాడు.

"ఇక్కడే, ఈ కాశీలోనే, చాలాకాలం క్రిందట. అయితే ఇంతకాలం మాదేశంలోనే ఉన్నాను. ఈమధ్యనే ఇక్కడికి

"ఏమిటి, మీ యిల్లు దగ్గిరేనా యేం?... కాస్త టీ ఇప్పించగలరూ? కాస్త టీ త్రాగాలని ఎన్నాళ్లనుంచో అభిలాష. చూడండి. టీ పొట్లం కొంగున కట్టుకుని తిరుగుతున్నాను. పోనీ ఏమిటాయి కొట్టుకైనా వెళ్ళి వేణ్ణీళ్లు అడిగిపుచ్చుకుని, అందులో కాస్త టీ పొడివేసి త్రాగితే కంఠం—"

"అలాగే, అలాగే. రండి. ఇక్కడే, దగ్గిరే మా ఇల్లు. రండి" అని అతణ్ణి పారిహారుడింటికి తీసుకెళ్లాడు.

టీ త్రాగే అలవాటు ఎప్పుడూ లేదు. చిన్న కళాయితో నీళ్లు కాచి టీ తయారు చేశారు. అపూ కంచు గ్లాసులో టీ, పళ్ళెంలో కాస్త ఫలారం ఆ కథకుని దగ్గిరకు తీసుకువచ్చాడు. అది చూసి కథకుడు చాలా సంతోషించాడు. ఫలారం కూడా లభ్యమవుతుందని అనుకోలేదతడు.

"మీ అబ్బాయిలాగున్నాడే. భేష్. చాలా బావున్నాడు మీ అబ్బాయి... వాహ్: రా, ఇలారా నాయనా! ఆ ఆ చిరంజీవీభవ, శుభం భూయాత్. ఒట్టి టీయేగా చేయించింది బాబూ?..."

"తమపిల్లలూ వాళ్లూ అంతా ఇక్కడే—"

"సంసారమే లేకపోతే పిలలేమిటి?... మూడెకరాలుపొలం ఎప్పుడైతే పోయిందో అప్పుడే మొదటికి మోసం వచ్చింది. కాస్త పొలమే కనుక ఉన్నట్లయితే—ఇప్పుడిలా ఇంతదూరం వచ్చేవాడినా? భలేవారే మీరు. ఇదొక ఊరా బాబూ! విశ్వేశ్వరు నెటూ సేవించవలసిందే అనుకోండి... ఇలా శీతకాలం వెళ్లిపోతున్నదా—ఓ ఖర్జూరరసం లేదు, ఓ బెల్లపు అచ్చులైనా లేవు. మాకు నలభై ఖర్జూర చెట్లున్నాయి బాబూ!"

"తమ ఊరు ఎక్కడ?"

"సాత్ క్షీరా దగ్గిర. 'శీతల-కాటి' గ్రామం తెలుసా మీకు. అక్కడి చక్రవర్తి వంశీయులు చాలాఘరానా—"

పారిహారుడు రెండు దమ్ములు హుక్కా లాగి, కథకుని చేతికందిచ్చి "త్రాగండి" అన్నాడు.

"ఏంలేదు, ఫాల్గుణ మాసం వచ్చిందనగానే వెళ్లిపోతాను. ఓ తోటఉంది. అమ్మేసి వసాను. మేము చాలా శ్రోత్రియులం లెండి. మూడెకరాలు పొలం ఉంటే తాకట్టుపెట్టి, 'కుల్కం' సంతనా చేసుకున్నాను. పెళ్ళి చేసుకున్నాను. పదేళ్లు కాపురమూ చేశాను. చివరికి ఏమయిందో తెలుసా? పందవేళ వసారామీది కుమ్మడికాయకోయటానికి వెళ్లింది. అక్కడ ఆమెకోసమే కాచుకుని ఉన్నదల్లే ఉంది పాము—చేతిమీద కాటువేసింది. నే నారోజున ఇంట్లో లేను. ఎవరో వైద్యులొచ్చి చూశారు. ఏ వైద్యం చేశారో ఏమో!—రేవు దాటుతు

మిస్ బి. ఎ. కి కార్లు సినిమాస్కోప్, టెలివిజన్ వంటి సంగతులేకాక, వ్యవసాయం గురించి, అనేక కుటీర పరిశ్రమల గురించీకూడా చాలా సంగతులు తెలుసు.

నరానరి పల్లెటూరు వెళ్లిన మర్నాడు, వాళ్ల అమ్మమ్మ పిల్లలకి తేనెతో మందు కలిపి ఇస్తూఉండగా మిస్. బి. ఎ. చూసి మందహాసం చేసింది. తేనె సీసా సుతారంగా తీసి చూస్తూ, మనింట్లో ఓ తేనెటీగని పెంచుతున్నామన్న మాట నాకు తెలుసులే" అంది గంభీరంగా.

పూరునుంచి వస్తున్నాడు. నన్ను చూడగానే 'చప్పున ఇంటికి వెళ్లండి బాబూ! మీ ఇంట్లో చాలా ప్రమాదం సంభవించింది' అని చెప్పాడు. ఏం ప్రమాదమో మాత్రం చెప్ప చెప్పలేదు. ఇంటికి వచ్చి చూద్దును గదా, క్రిందటిరోజు రాత్రే చనిపోయింది నా భార్య. ఇదీ జరిగింది బాబూ! భూమికి భూమీ పోయింది, పుస్తె కట్టిన భార్యా పోయింది. అప్పట్నుంచి ఇహ అక్కడ వుండిమాత్రం ఏం లాభం అనిపించింది. ఎక్కడనుంచి తీసుకు వచ్చేది నాలుగయిదు వందలు మళ్లీ పెళ్ళిచేసుకోటానికి? "విశ్వనాథుని సన్నిధికయినా పోదాం, భుక్తికి లోటు ఉండదు అక్కడ," అనుకున్నాను. ఇక్కడికి వచ్చి ఎనిమిదేళ్లయింది. పినతండ్రి కొడుకు ఒకడు ఉన్నాడు, కొద్దో గొప్పో మిగిలిన భూమి ఏదయినా ఉంటే అది కాస్తా అతడు దఖలు పరచుకు కూర్చున్నాడు. నీకు భాగం లేదు పొమ్మన్నాడు. సరే, లేదంటే లేనట్లే. తగాదాల్లో తలదూర్చటం అనేది నాకెన్నడూ లేదు. దఖలు పరచుకుంటే పరచుకున్నాడు...ఇంక వస్తాను బాబూ! మీ ఇంట్లో మంచి టీ త్రాగగలిగాను—ఏడీ? మీ పిల్లవాడెటు వెళ్లాడు? భలే పిల్లవాడు అచ్చగా—"

పాత తొలుముక్కలు అతుకు లేసిన కావ్యాసు జోడు దులిపి తొడుక్కుని, గుమ్మందాకా వచ్చాడు— వెడుతూ వెడుతూ 'లేపూ ఉంది వామనభిక్షు. ఏమవుతుందో

# విశ్వరహస్యాల



అమెరికా ఎగురవేయనున్న 'ఉపగ్రహం'. 20 అంగుళాల వ్యాసంగల ఈ గోళంలో, వాతావరణం స్వరూపస్వభావాలగురించిన అమూల్యసమాచారాన్ని గ్రహించి, భూమిమీది పరిశీలనా కేంద్రాలకు ప్రసారంచేసే సున్నితతరమైన పరికాలు ఉంటాయి. దీని బరువు సుమారు వందపౌనులు ఉంటుంది.

"ఏదేశ పసిబిడ్డ ఎంతకాలం ఉయ్యాలలో పడిఉంటాడు? ... మానవుడూ అంతే. ఈభూమి మనకి ఉయ్యాలవంటిది" ఈశతాబ్దారంభంలో ఒక ప్రముఖశాస్త్రజ్ఞుడు అన్నమాటలివి.

ఈజులైనెల మళ్లా పుట్టేపరిశల్లా ఈ "ఉయ్యాల" అవతల ఏముందో, దానిమంచీ చెడూ ఏమిటో గుణగణాలేమిటో గట్టిగా, ఖండిగా కనుక్కోడానికి కట్టుదిట్టమైన పద్ధతిలో ప్రయత్నం ప్రారంభం కాబోతోంది. ఆప్రయత్నంలో ఒక్క శాస్త్రజ్ఞుడూ, ఒక్క దేశమూ కాదు; ప్రపంచవ్యాప్తంగా 40 పైచిలుకు దేశాలూ కొన్నివందలమంది శాస్త్రజ్ఞులూ పాల్గొనబోతున్నారు. ఆప్రయత్నం 18 మాసాలపాటు నిర్విరామంగా సాగుతుంది. ఆ కాలానికి "అంతర్జాతీయ భూగోళికశాస్త్రసంవత్సరం" అని పేరు పెట్టారు. 1957 జులై 1 వ ప్రారంభమై 1958 డిసెంబరు 31 వ ముగిసే ఈ అంతర్జాతీయ సంవత్సరంలో అమెరికా దేశం పన్నెండు కృత్రిమ ఉపగ్రహాలను ఆకాశంలోకి పంపిస్తుంది. ఫుట్‌బాల్ ఆకారంలో ఉండే ఈ ఉపగ్రహాలు రెండు మూడువందలమైళ్ళదూరంపోయి, అక్కడ నుంచి భూమికి 90 నిమిషాలకొకసారి ప్రదక్షిణం చేస్తాయి. ఇవి, గ్రహం గోళం అన్నమాటవినగానే తోచేటంత పెద్దవేమీకాదు. ఈ గోళాల వ్యాసం 20 అంగుళాలకు మించదు.

మానవుడి తెలివితేటలవిగ్గు, ఏళ్ళతరబడి చేసినకృషి ఫలితం ఇముడ్చుకొని రూపొందిన పరికరాలు చిన్నచిన్నవి ఇందులో ఉంటాయి. అంతా కలసి మొత్తం నూరు నూటపది పౌనుల బరువు ఉంటుంది.

భూమిమీదకూర్చునిఎన్నిరకాలశాస్త్రీయ పరికరాలు పెట్టుకుని ఎంత తిప్పలు పడా దొరకని అమూల్యమైన విశ్వరహస్యాలను, ఫుట్‌బాల్ అంత ఉండే ఈచిన్న గోళాలు మనకి చేరవేస్తాయి. చందమామని అంగుళం పట్టడం మాట ఎలా ఉన్నా ముందర, వ్యవసాయం, నౌకాయానం, విమానయానం మొదలైన వాటికి చాలా అవసరమూ, ఎంతో ఉపయోగకరమూ అయిన సమాచారాన్ని వీటిద్వారా తెలుసుకోవడం సాధ్యపడుతుందని శాస్త్రజ్ఞులు నమ్ముతున్నారు. మాటవరసకి కాస్మిక్ కిరణాల వంటి వాటివల్ల భూమిమీద జీవకోటి ధ్వంసంకావచ్చు. భూమినిచుట్టి ఉండే వాతావరణ కవచం వాటి శక్తిని హరించివేయడం వల్ల మనుగడ సాధ్యం అవుతోందని సిద్ధాంతం. అయితే ఈ కిరణాలగుణగణాలు, వీటి సమగ్రస్వరూపస్వభావాలూ ఇదమిత్థంగా తెలియరాలేదు. ఇక్కడ కూర్చుని పరిశీలన, పరిశోధన ఎంతగా సాగించినా, అవైనం తెలియదు. తెలియాలీ అంటే, అవి భూమి వాతావరణం పొరలలో ప్రవేశించడానికి ముందుగానే వాటిని పరిశీలించడం అవసరం. అంతపైకి వెళ్ళి స్థిమితంగా ఉండి ఈపని సాగించడం విమానయానం అందుబాటులోది కాదు. అందుకని రాకెట్‌లను పంపాలను కొన్నారు. దానికైనా, అంత దూరం వెళ్ళడానికి కావలసిన సరంజామా, ఇంధనం ఎంతకావాలో లెక్క వేసి చూస్తే అది సాగివచ్చే పని అనిపించలేదు. అందుకని మార్గాంతరాలు అన్వేషించి చివరకి 'త్రీ స్టేజ్ (అంచెలవారీగా) రాకెట్' ద్వారా ఈ కృత్రిమ గోళాలను పంపడం బాగుంటుందని ఒకపథకం వేశారు.

ఈ పథకం లక్ష్యం, కృత్రిమగోళాన్ని వాతావరణం అంచువరకూ తీసుకుపళ్లి వదలి వెయ్యడం. ఈ రాకెట్ యాత్రామార్గంలో మూడుఘట్టాలు వుంటాయి. స్థూలంగా అది భూమిని చుట్టి ఉండే వాతావరణం పొర

లన్నమాట. మొదటి పొరని "ట్రోపో స్ఫియర్" (శీతోష్ణ వాయుమండలం) అంటారు ఇది భూమిని అంటి పెట్టుకున్నట్టు ఉండే మొదటి కవచం. అంటే మన చుట్టూరా, మన పైన పన్నెండు పధ్నాలుగు మైళ్ళ ఎత్తువరకూ ఉన్నది ఈ మండలంలో పైకి పోను పోను ఉష్ణోగ్రత తగుతూ ఉంటుంది. మేఘాలు అనబడేవన్నీ దాదాపు అన్నిరకాలవీ అన్ని తరహాలవీ ఈ మండలం లోనే ఏర్పడుతాయి

పధ్నాలుగు మైళ్ల తరువాతనించి భూమికి 50 మైళ్ళ వరకూ ఉండేది 'స్ట్రాటోస్ఫియర్' (సమోష్ణ వాయు మండలం) ఇందులో ఉష్ణోగ్రత ఎత్తునుబట్టి మారుతూ ఉండదు. కాస్త మారినా, మరీ మొదటిమండలంలో అంతగా పైకిపోయిన కొద్దీ తగ్గిపోవడం జరుగదు.

తరువాతది – అంటే 50 మైళ్ళ నుండి రెండు మూడు వందల మైళ్ళ మధ్యవరకూ వ్యాపించి ఉన్నదాన్ని 'ఐయోనోస్ఫియర్ (అణు శక్తిపూర్ణ వాయు మండలం) అంటారు. ఇది, విద్యుద్ధారకమైన అణువుల యొక్క పొరలతో నిండి ఉంటుంది ఈ మండలం అవతల అంచుకి, ఈ కృత్రిమ గోళాన్ని పంపదలచి ఉంటుంది.



ఉపగ్రహానికి వాహనం అనతగ్గ మూడు అంచెల రాకెట్.

దీనికై అంచెల రాకెట్ రూపొందిస్తున్నారు. నిజానికిది మూడు రాకెట్ల సమ్మేళనం. పైన కృత్రిమ గోళాన్ని అమర్చడానికి మూతపెడతారు

రాకెట్ బయలుదేరుతుంది. మొదటి మండలం (ట్రోపోస్ఫియర్) 14 మైళ్ళ దూరం ప్రయాణం చెయ్యగానే, మూడింటిలోను అట్టడుగున ఉన్న రాకెట్ దానంతట అదే రాలిపోతుంది. ఉత్తరక్షణంలో రెండో అంచె రాకెట్ లో మోటారు మేలుకొని పుంజుకుంటుంది. రెండో మండలం స్ట్రాటోస్ఫియర్ ను దాటించగానే అది వెనక్కి దిగడుతుంది. అక్కడనించి మూడో రాకెట్ (ఆఖరది) గోళానికి వాహనం అవుతుంది రెండు మూడు వందల మైళ్ళ దూరం వెళ్ళి "ఐయోనోస్ఫియర్" అంచు చేరగానే ఇది అమాంతం భూమికి సమాంతరంగా తిరిగి దాని చివర అమరి ఉన్న గోళాన్ని మహా ఉధృతంగా ఒకతోపు తోసేసి అది కిందరాలి పోతుంది.

అది కథ

అక్కడితో ఆగోళం, భూప్రదక్షిణానికి అనువైన గాడిపడి గంటకి 18 వేల మైళ్ళ వేగంతో 90 నిముషాల కొకసారి భూమిని చుట్టడం ప్రారంభిస్తుంది ఇలా తిరగడానికి దానికింక ఇంజనూ పెట్రోలూ ఏమీ అక్కర లేదు ఎందుకంటే మూడో రాకెట్ పడిపోయేముందు దాన్ని తుపాకిలో గుండులా విపరీతమైన వేగంతో షూట్ చేసింది. నిరాధారంగా అలా పోయే ఆ గోళాన్ని భూమి ఆకర్షించి తనవైపు లాగ చూస్తుంది. కాని, అమితమైన ఆ వేగంవల్ల అది దట్టుక్కున సాగిరాదు. అది భూమికి రాలకపోయినా, భూమి దాన్ని లాగుతూనే ఉంటుంది





మూడు అంచెల రాకెట్ ద్వారా కృత్రిమ ఉపగ్రహాన్ని, వాతావరణం అంచుకు పంపించడానికి వేసిన పధకం స్వరూపం. ఒక్కొక్క మండలం దాటగానే ఒక్కొక్క రాకెట్ రాలిపోతూ ఉంటుంది. మూడవ మండలం అంచు చేరగానే ఆఖరు అంచె రాకెట్ భూమికి సమాంతరం గావాలి, ఉపగ్రహాన్ని మహా ఉధృతంగా 'షూట్' చేస్తుంది ఆతరువాత ఆగ్రహం 90 నిముషాల కొకసారి భూమికి ప్రదక్షిణం చేస్తూ ఉంటుంది.

కాబట్టి ఆగోళం ఇంకా ఎత్తుకిగాని, గుండ్రంగా తిరగకుండా, తిన్నగా పోవడంకాని సాధ్యపడదు అంటే, భూమి ఆకర్షణశక్తివల్ల దానికి కృత్రిమమైన 'గాడి' ఒకటి ఏర్పడుతుందన్నమాట.

ఒక దారానికి ఒక చిన్న రాయి కట్టి, రెండో కొసవేలుకు చుట్టుకుని గిరగిర తిప్పామనుకోండి.

మొదట తిరగడానికి శక్తి మనచేతివల్ల లభించినా కొంత వేగం పుంజుకున్నాక, ఇంక తిప్పకపోయినా, అది కొద్దిక్షణాల పాటు అలాగే తిరగగలదు. దారం దాన్ని ఇంకెటూ పోనియక లాగిపట్టడమే దానికి కారణం. సరిగ్గా ఇక్కడా అంతే, భూమి ఆకర్షణశక్తి, ఆదారంలా ఈ గోళం గాడిని తిరగడానికి ఆధారం. దారం చివర

# ★ విశ్వరహస్యాలకై విశ్వప్రయత్నం ★

రాయి కొంతసేపు తిరిగాక, క్రమంగా జవం తగ్గి వాలి రాలిపోయినట్టే, ఈ గోళంకూడా కొంతకాలానికి వేగం తగ్గే కొద్దీ భూమి బలానికి లొంగి క్రమంగా దగ్గరకురావడం మొదలుపెట్టి క్రమంగా ధ్వంసం అయిపోతుంది.

ఎటొచ్చి దారం చివర రాయిలా తృణాలమీద పడిపోదు, విపరీతమైన వేగంతో తిరుగుతుంది కాబట్టి, అదీ, భూమికి రెండు మూడు వందల మైళ్లదూరాన్ని కాబట్టి ఇది లొంగి వచ్చి రాలిపోడానికి ముప్ఫై నలభై రోజులు పడుతుంది. అంత ఎత్తున గాలి పలచగా ఉంటుంది గాబట్టి దీని వేగం చప్పున తగ్గేటంత ఒరిపిడి ఉండదు.

ఈ మాత్రం అవకాశం ఉంటే చాలా సంగతులు తెలుసుకోవచ్చునని శాస్త్ర అభిప్రాయం. అదీకాక, ఇలాంటివి 12 గోళాలు పంపిస్తున్నారు. కాబట్టి శ్రమకు తగ్గ ఫలం దొరుకుతుందని నమ్మకం.

భూమికి ఉపగ్రహాలుగా తిరిగే ఈగోళాలలో ఎంతో సూక్ష్మమైన విషయాలను గ్రహించే శక్తిగల పరికరాలు ఉంటాయి. అవి గ్రహించిన విషయాలు భూమిమీద శాస్త్రజ్ఞులకు అందచేయడానికి ప్రసారక యంత్రాలు ఉంటాయి. ఇదంతా 'రాడార్' కంట్రోలు ద్వారా జరుగుతుంది. కాస్మిక్, అల్ట్రావైలెట్, ఇన్‌ఫ్రారెడ్ మొదలైన కిరణాల స్వరూప స్వభావాలూ, వాతావరణం సాంద్రత, ఉష్ణోగ్రత అందులో మార్పులు, ఏఏ ప్రమాణాలలో గాలి ఎలా వీచేదీ, భూమ్యాకర్షణ శక్తిబలం, పరిధి, దాని స్వభావం మొదలైన వివిధ విషయాల గురించిన సమగ్ర సమాచారాన్ని ఉల్కల గురించిన సంగతి సందర్భాలు ఇవి గ్రహిస్తాయి. ఆపైన భూమికి ఆ భోగట్టాని అందచేస్తాయి. అమూల్యమైన ఆ సమాచారం వల్ల, వాతావరణం మార్పులను, తీరు తెన్నులను, ఇప్పటికన్న సమగ్రంగా, ఇంతకన్న ఖచ్చితంగా ముందు తెలుసుకోవడానికి వీలుకలుగుతుంది. వాటివల్ల వ్యవసాయ రంగంలో, నౌకా విమానయానాలలో అభివృద్ధి సాధించడానికి ఎంతో దోహదం జరుగుతుంది.

నిజాలు కాబోతున్న కలలు, ఇంకా త్వరగా రూపాలు ధరించడానికి, దారి కనబడవచ్చు. చంద్రలోక యాత్రకు వెళ్ళే రాకెట్లు మధ్యలో మజిలీ చెయ్యడానికి, ఇంధనం వేసుకోడానికి వీలుగా అంతరిక్షంలో తేలుతూ ఉండే "స్టేషన్"లు ఏర్పాటు చేయాలని శాస్త్రజ్ఞుల పథకం. ఇందులో ఉండే సాధక బాధకాలన్నీ తెల్సుకోడానికి ఈ గోళాలు ఇచ్చే సమాచారం బాగా ఉపయోగిస్తుందని కూడా నమ్ముతున్నారు.

బ్రిటన్ ఇంకోరకమైన పథకం ఆలోచిస్తోంది. దీని ప్రకారం, పెద్ద హైడ్రోజన్ బెలూన్ తయారుచేసి దానికి రాకెట్‌ను అమర్చి 70 వేల అడుగుల ఎత్తువరకూ పంపుతారు. ఆపైన రాకెట్ బయలుదేరి 120 మైళ్ళ పైకి వెళ్తుంది. ఈ ప్రకారం చేస్తే అమెరికా ఒక ఉపగ్రహం పంపడానికి అయే ఖర్చుతో, ఇటువంటివి చాలా పంపవచ్చునంటున్నారు. రష్యా కూడా, ఉపగ్రహాలను, అమెరికన్ గోళాలకన్న కొంచెం పెద్దవిగా నిర్మించి పంపదలచిందని గత జూలైలో సోవియట్ ప్రతినిధి ఒకరు చెప్పారు. ఈ పథకాలు అమలు జరిగినా, "అంతర్జాతీయ సంవత్సరం" పేరిట జరిగే కృషిలో 40 దేశాలు పాల్గొంటాయి. వాటిలో మనదేశం కూడా ఉంది. ఉపగ్రహాలపైనుండి ప్రసారంచేసే సమాచారాన్ని అందుకోవడానికి, గ్రహాలగమనాన్ని, మొత్తంమీద వాతావరణాన్ని పరిశీలించడానికి ప్రపంచ వ్యాప్తంగా అనేక పరిశోధనా కేంద్రాలు వెలుస్తాయి. వందల కొద్దీ శాస్త్రజ్ఞులు ఇందులో పాల్గొంటారు. వీరందరి కృషినీ సమన్వయించడానికీ, సమయోచితంగా సూచనలు చేయడానికి ప్రత్యేకం ఒక కేంద్ర సంఘం ఉంటుంది.

పరిశీలనాసౌలభ్యంకోసం, భూగోళాన్ని శాస్త్రజ్ఞులు ఆరు భాగాలు చేశారు. అక్షాంశాలవారీగా (పైనుండి క్రిందికి) మూడు భాగాలు: ఆర్కిటిక్ ప్రాంతం, భూమధ్య రేఖా ప్రాంతం, అంటార్కిటిక్ ప్రాంతం. తిరిగి దీర్ఘాంశాల ప్రకారం మూడు భాగాలు. 1. ఉత్తర దక్షిణ అమెరికాలు 2) యూరప్ ఆఫ్రికాఖండాలు (3) సోవియట్ యూనియన్, ఆసియా, ఆస్ట్రేలియాలు.

పోతే, పరిశీలనా కేంద్రాలు సాధ్యమైనంతవరకూ ఒకే దీర్ఘాంశపైఉండడానికి వీలుగా గ్రీన్‌విచ్‌కి పడమట 80 వ అక్షాంశాన్ని తూర్పున పదవ, 140 వ అక్షాంశాలనూ తీసుకుని, ఆయా దేశాలలోని పరిశీలనా కేంద్రాలు ఈ రేఖలపై ఉండేటట్లు ఏర్పాటు చేయాలని నిశ్చయించారు.

ఈ అంతర్జాతీయ సంవత్సరానికి 1957 జూలైనుండి 1958 డిసెంబరు వరకూ ముహూర్తం పెట్టడానికి కారణం ఉంది. 1958 నాటికి సూర్యగోళం ఎంతో చైతన్యవంతంగాఉంటుందట. పెద్దపెద్దమచ్చలు ఏర్పడడం, సంచలనాలు కలిగి గోళంలో ఉత్పాతాలు సంభవించడం తరుచుగా జరుగుతుందట. అందువల్ల భూగోళంపైనా, వాతావరణంపైనా సూర్యగోళ ప్రభావాలు పరిశీలించడానికి ఆకాలం ఎంతోముఖ్యమట.

# ప్రొఫెసర్ పాపారావు

ప్రొఫెసర్ పాపారావుకి ఎదురుగా టేబిల్ మీద నాలుగైదు చిన్న కంకరరాళ్ళు ఉన్నాయి. అతను అర్ధనిమీలిత నేత్రాలతో ఒకసారి వాటికేసి చూశాడు. చేత్తో బట్టతల ఒకసారి తడుముకున్నాడు. మునివేళ్లతో నాలుగైదుసార్లు పొడుగుపాటి తన ముక్కుమీద రాసుకున్నాడు. రెండు చేతులతో టేబిల్ మీద కాసేపు టకటకా మైపుకొట్టాడు. ఎన్నివిధాల ప్రయత్నించి చూచినా అతనికి జ్ఞాపకం రాలేదు.

తనకెదురుగా టేబిల్ మీద నిశ్చలంగా పడివున్న ఆ నాలుగైదు కంకరరాళ్లు తన మూకభాషలో ఏ విషయాన్ని తనకి తెలియజేస్తున్నాయో అతనెంత ఆలోచించినా జ్ఞాపకం రావడంలేదు. ఏ ఉద్దేశాన్ని పురస్కరించుకుని ఇవి తన జేబులో ప్రవేశపెట్టబడ్డాయో అన్నది ప్రొఫెసర్ పాపారావుకి ఒక పెద్ద సమస్యఅయి కూర్చుంది.

అసలు సంగతి — ఆరోజు పూర్తిక్లాసు నడుస్తోంది. లెక్చర్ ఇవ్వబోయేముందు ఉత్సాహంకోసం ప్రొఫెసర్ పాపారావు తన చేతిలోని పుస్తకం పేజీలు ప్రరుమని అదేపనిగా ఈ చివరినించి ఆ చివరికి తిరగవేస్తున్నాడు.

ఇంతలో ముందు బెంచీనుండి ఒక అమ్మాయి లేచినుంచుంది. కాలేజీ లైబ్రరీకి క్రొత్తగా పెట్టబోయే ఫేన్సుకోసం చందా వసూలు చేసే మహద్భారం ఆ అమ్మాయి తనమీద వేసుకున్న చిన్న సంగతి పాపం పాపారావుకి ఏం జ్ఞాపకం! అతను తన ధోరణిలో తను ఉండడంవల్ల ఆ అమ్మాయి లేచి నుంచున్న సంగతే గమనించలేదు. అంతమాత్రానికి ఆ అమ్మాయి నిరుత్సాహపడలేదు.

ఆ అమ్మాయి చిరునవ్వు ముఖంలో చిందులాడుతూండగా "మేష్టారూ, మా ఫేన్సు సంగతి మీరు పూర్తిగా మరిచిపోయినట్టున్నారే?" అని చిన్న చిరునవ్వు నవ్వించేసింది. అందులోనూ వాక్యం చివరిభాగంమీద కొంచెం నొక్కింది. ఆసంకేతాన్ని కనిపెట్టినట్టుగా క్లాసులో ఆచివరినుంచి ఈచివరికి ఒకచిన్న హర్షరేఖ ప్రవహించింది. ప్రొఫెసర్ పాపారావుయొక్క జ్ఞాపకశక్తి ఎంత ఏపాటులో ఉంటుందో వాళ్లకి తెలియని విషయంకాదు.

అయితే ప్రొఫెసర్ పాపారావు ఆక్షణంలో కళ్లు పూర్తిగా మూసుకుని తను ఇవ్వబోయే లెక్చర్ యొక్క సంపూర్ణ స్వరూపాన్ని తనముందు సాక్షాత్కరింపజేసుకోడంలో నిమగ్నుడైయున్నాడు. అతనినుంచి ఏమాత్రమూ సమాధానం రాలేదు. అంతమాత్రానికి వెనకతీస్తే ఇంక ఆ అమ్మాయి ప్రత్యేకత ఏముంది? కొంచెం గట్టిగా నే — "మేష్టారూ, మా ఫేన్సు సంగతి ఏంజేశారు?" అని నిలవదీసి అడిగింది ప్రొఫెసర్ పాపారావుని.

దెబ్బతో అతను తన కల్పనామయ ప్రపంచంలోంచి ఒక్క సారిగా ఈభౌతిక జగత్తులోకి వచ్చి పడ్డాడు. "ఫేన్సా, మీ ఫేన్సా" అన్నాడు ఆశ్చర్యంగా. ఆ అమ్మాయి చందా వసూలవుతుంది కదా అనే ఉత్సాహంతో "అవునండీ, మా ఫేన్సే" అంది. పాపారావు కొంచెం విచారసూచక కంఠస్వరంతో — "నువ్వు ఈ ఫేన్సు గొడవలో పడ్డావేమిటి, చదువుకుని బాగుపడవలచుకున్నదానవు — ఇప్పటినుంచి నీకి ఫేన్సు వ్యామోహం తగదుసుమా!" అంటూ ఆమెను నెమ్మదిగానే మందలించాడు. ప్రొఫెసర్ పాపారావు క్లాసులో అప్పుడప్పుడు విద్యార్థులకు ఉపదేశాలిస్తూండడం మామూలే.

అయితే ఇది ఏరకమైన ఉపదేశాల్లో జేరుతుందో ఆ అమ్మాయికి బొత్తిగా అర్థంకాలేదు ఆమె ప్రొఫెసర్ కి నచ్చచెప్పే ఉద్దేశ్యంతో — "అదేమటండీ మేష్టారూ, ఫేన్సు లేకుండా వేసవి గడపడం —" అంటూ ఏదో చెప్పబోయింది.

ఈ కాలపు ఆడపిల్లలు ఎంతకేనా తగుదురు! ప్రొఫెసర్ పాపారావు ఆశ్చర్యానికి అంతులేదు నిజంగా అతనికి కళ్లు మంగుకుపోయింది — "అయితే ఫేన్సు లేనిదే నీకు వేసవి గడవ దన్నమాట!" అన్నాడు అతి వెటకారంగా.

పాపం! ఆ అమ్మాయికి అతని వాలకమేమీ అర్థమవక అతని ముఖం కేసి తెల్లపోయిచూసింది. పాపారావు అతిగంభీరంగా తన అంతిమ నిర్ణయాన్ని తెలియజేశాడు — "ఈ ఫేన్సు పిచ్చి నీ బుర్రలోంచి పూర్తిగా తీసిపారెయ్యి!"

ఆ అమ్మాయి అధైర్యపడకుండా "ఈ ఆధునిక యుగంలో ఫేన్సు యొక్క ప్రాముఖ్యతని మీరింకా గుర్తించక పోడం చాలా శోచనీయం!" అంది ఏదో విధంగా చందా వసూలు చేసుకుందామనే ఉబలాటం ఆ అమ్మాయిలో ఇంకా చావలేదు.

"అయితే అది నాదోషం కాదు-యుగదోషం! ఈ ఫేన్సు పిచ్చి నేడు ఎంత తీవ్రరూపం దాల్చిందో తెలుసుకోవాలంటే ఏ సినీ తారవేనా అడుగు. వాళ్ళ పేరరోజూ వచ్చే వందలాది ఉత్తరాలు చదివిచూడు ఈ ఫేన్సు వ్రాసే ఉత్తరాలకి తలాతోకాఅంటూ ఉండవు "నీ అభినయం అద్భుతం" అని ఒకడూ, "నీ అంత అందగత్తె ఈ ప్రపంచంలోనే లేదు" అని ఇంకొకడూ — ఈ విధంగా రకరకాల ఉత్తరాలు వ్రాస్తూ ఉంటారు మరికొందరు ఇంకొక అడుగు ముందుకి వేసి ప్రేమాలాపాలలోకీ ప్రణయకలాపాలలోకి దిగుతారు పాపం, సినీ తారలకి ఇటువంటి ఉత్తరాలు చదివి చదివి నిజంగా పిచ్చెక్కిపోతూంటుంది."

ప్రొఫెసర్ పాపారావిచ్చిన ఈ అమూల్యమైన భోగట్టాకు క్లాసుక్లాసంతా హర్షధ్వానాలు చేశారు ఫేన్సుశబ్దానికి అర్థతాత్పర్యాలతో సహా అతను చేసిన వ్యాఖ్య వాళ్లందరికీ అమందానందాన్ని కలగజేసిందని చెప్పవచ్చు!

వెనక బెంచీలనుంచి ఏకగ్రీవంగా నాలుగైదు కంఠస్వరాలు — "ముందు బెంచీలకి ఫేన్సుగా ఉండేందుకు మేము తయారుగా ఉన్నాం" అని ప్రకటించాయి. పరిస్థితులిలా తల్లక్రిందులవడం చూసి ఆ అమ్మాయికి ముందులో ఏం చెప్పేందుకూ తోచలేదు. అయితే ఓడిపోయానని ఒప్పుకోడం

ముడుంబ నరసింహాచార్య

...తి అమ్మాయి స్వభావానికి అత్యంత విరుద్ధం. "ఉత్తరాలు వ్రాసే ఫేన్సు మాకవసరం లేదు- గాలిఇచ్చే ఫేన్సుమాత్రమే మాకు కావలసింది" అంది అతిఝూంకారంగా

ప్రొఫెసర్ పాపారావు నిజానికి తనతప్పు ఒప్పుకోడం విషయంలో చాలా ఉదారంగానే ప్రవర్తించాడు— "అరరే, ఎంత పొరపాటు! చాలా విచారిస్తున్నాను నీకు ఆకొలకు చందా ఇస్తానన్నా కాదూ! మరిచేపోయాను. క్షమించు. కొంచెం, ఆ మేకుని తగిలించి ఉన్న నా కోటు పైజేబులో ఉన్నదంతా తీసి ఇల్లా తీసుకొస్తావా? వెంటనే నీ ఋణాన్నుంచి విముక్తుణ్ణవుతాను."

ఆ అమ్మాయి అతి ఉత్సాహంతో కోటుదగ్గిరికి వెళ్లి పై జేబులోకి చెయ్యిపోనిచ్చింది ఉన్నదంతా ఒక్కసారిగా చేత్తో దేవి పైకితీసింది. అలాగే తిరిగివచ్చి ప్రొఫెసర్ పాపారావు టేబిల్ మీద తన గుప్పిట్లోని ఆస్తంతా ఘుల్లుమనిపోసింది. రూపాయలూ కాదు; చిలరా కాదు - నాలుగైదు చిన్న కంకరరాళ్లు టేబిల్ మీద నాట్యమాడాయి. ఆ అమ్మాయి చేసిన ఈ గాండీపనికి క్లాసు క్లాసంతా ఆశ్చర్య చకితులై పోయారు.

ఆ అమ్మాయి పాపారావుమీద పగతీర్చుకోవాలనే కసితో "ఈ కంకరరాళ్లు పెట్టి ఫేన్సు కొనుక్కోమంటారా మేష్టారు?" అని ప్రశ్నించింది "ఎందుకంటాను? కాని ఇది పూర్తిగా పెర్సనల్ మేటర్! నా దృష్టిలో ఈ కంకరరాళ్లు ఏ బంగారు నాణెములకీ తీసిపోవు దయచేసి ఇవి జాగ్రత్తగా మళ్ళీ నా జేబులో పెట్టేస్తే చాలా సంతోషిస్తాను"

వెనుక బెంచీలమీద ఒక గొంతుక "ఓహో! అవి రాతియుగము నాటి నాణెములయి ఉంటాయి" అని రిమార్కు చేసింది

నిజానికి ఈ కంకరరాళ్లు ప్రొఫెసర్ పాపారావు దృష్టిలో ఎంతో అమూల్యమైనవని ఒప్పుకుని తీరాలి. తన శ్రీమతి పుట్టింటికి వెళ్లడం కాని వెళ్లకపోవడం కాని ఈ కంకరరాళ్ళ మూకభాష మీదే ఆధారపడి ఉంది. ఇంకొ ఇటువంటి మహత్తర సమస్యలనేకం అతనికి ఈ కంకరరాళ్ళ ద్వారానే పరిష్కారమవుతూ ఉంటాయంటే ఏమీ అతిశయోక్తి కాదు

అసలు విషయం చెప్పాలంటే— ప్రొఫెసర్ పాపారావు శ్రీమతి అతని జ్ఞాపకశక్తి మీద నమ్మకాన్ని ఏనాడో గోల్పోయింది. అయితే గృహస్థ జీవితంలో అతను నిర్వర్తింప వలసిన కార్యాభారాలనేకం ఉండడమే కాక విశేషించి శ్రీమతి ఆజ్ఞాపాలన చెయ్యవలసిన ప్రత్యేక కారణంకూడా అతని మీద వుండడం గమనించదగ్గ విషయం.

ప్రొఫెసర్ జ్ఞాపకశక్తిని ఉత్తేజిత పరచి దాన్ని దారికి తీసుకు రావలసిన ప్రత్యేక లక్ష్యంతో శ్రీమతి ఎంతో కాలంనుంచి అతనిమీద అనేక ప్రయోగాలు చేస్తూంది. తన ప్రయత్నాలు నిష్ఫలమవుతూన్న కొలదీ ఆమె ద్విగుణీకృతోత్సాహంతో క్రొత్తకొత్త పద్ధతులు అవలంబిస్తూ వస్తోంది. ప్రొఫెసర్ జ్ఞాపకశక్తిని పునరుజ్జీవింప జేయడానికి శ్రీమతి ఈమధ్య అవలంబించిన విధానాలన్నిటిలో ముఖ్యంగా ఇక్కడ రెండింటిని పేర్కొన వలసిఉంది.

ఇంటికి కావలసిన వస్తువునిగాని ఏదేనా చెయ్యవలసిన పనినిగాని అతనికి జ్ఞాపకం చెయ్యాలంటే అతని జేబురుమాలుకి ముళ్లు వెయ్యడమో లేక అతని జేబులో కంకర రాళ్లు పడవెయ్యడమో చేస్తోంది శ్రీమతి.

అయితే జేబురుమాలుకి ముళ్లు వెయ్యడం పద్ధతి పూర్తిగా ఫేలయిపోయిందనే చెప్పాలి ప్రొఫెసర్ పాపారావుతో వచ్చిన పెద్దచిక్కేమిటంటే ఇల్లు వదిలీవదలడంతో అతను పూర్తిగా కాలేజివాతావరణంలో పడిపోతాడు. ఇంటిసంగతి-శ్రీమతి విషయం-గృహస్థ కర్తవ్యాల గొడవా పూర్తిగా విస్మృతిపథంలో పడిపోతాయి

ఏదో పరధ్యానంలో ఉండి ముక్కో ముఖమో తుడుచుకోడానికి చటుక్కున జేబురుమాలు తీస్తాడు. చేతికి ఏదో ముడిలాగ తగులుతుంది. ఏ లెక్చర్ ధోరణిలోనో ఉండి ఆ అడ్డువచ్చిన ముడి శుభ్రంగా విప్పేస్తాడు. తుడుచుకోడం కాగానే మళ్లీ దాన్ని జేబులో పెటేస్తాడు. ఏమాత్రమైనా కొంచెం ఇంటిధోరణిలో ఉంటే జేబురుమాలు విషయంలో అంత నిర్లక్ష్యంగా ఉన్నందుకు చాకలివాడిని నాలుగు తిట్టుకుంటాడు. ఇంక శ్రీమతికి ఇంట్లో కావలసిన వస్తువేదో అతను జ్ఞాపకం పెట్టుకోడం ఎల్లా సాధ్యమవుతుంది?

అతను ఇంటికి చేరుకోగానే శ్రీమతి— "ఏమండీ, ఈ వేళైనా తెచ్చారా లేదా" అని ఎంత అడుగుతేమాత్రం ఏం ప్రయోజనం?

ప్రొఫెసర్ పాపారావు తడుముకోకుండా-"నువ్వు జేబురుమాలికి ముడివేస్తే కాదూ నేను తేవడానికి?" అనేస్తాడు.

"ముడివేశానే" అంటుంది పాపం శ్రీమతి.

"ఎక్కడవేశావు? ఇదుగో-కావలిస్తే చూసుకో-" అంటూ అతను జేబురుమాలు తీసి చూపేస్తాడు. చూస్తే ఎక్కడా ముడివేసిన ఆనవాలుకూడా కనిపించదు.

"నేను ముడివెయ్యకపోవడమేమిటి? మీరు విప్పేసి ఉండాలి."

"బాగుంది- నేనెందుకు విప్పుతాను?"

"నేను వెయ్యకుండా ఎందుకుంటాను?"

"మనుష్యమాత్రుడికి మరుపు సహజం" అంటూ ప్రొఫెసర్ పాపారావు అతి ఉదారత్వం కనబరుస్తూ శ్రీమతిని తేలికగా క్షమించేస్తాడు. అయితే శ్రీమతి అతని గొప్పతనాన్ని గుర్తిస్తేకదూ? పైగా అతనిమీదికి వ్యంగ్యబాణాన్ని విసురుతూంది— "మనుష్యమాత్రుడికి అతి సహజమే-ఒప్పుకుంటాను-అయితే స్త్రీకిమాత్రం అసహజం" అనేస్తుంది. ఏమయితే ఏమిలాభం? శ్రీమతి అవసరమైన ఆ వస్తువేదో లేకుండానే సర్దుకునిపోవలసి వస్తుంది.

ఈవిధంగా జేబురుమాలులోని జ్ఞాపక గ్రంథులు వ్యర్థమని తేలిపోయింది. అయితే, ప్రొఫెసర్ కావాలని శ్రీమతి ఆజ్ఞాపాలనంలో అశ్రద్ధ చూపుతున్నాడని అనుకోడానికి ఎంతమాత్రం వీలులేదు. నిజంగా అతను శ్రీమతియెడల చూపే శ్రద్ధాభక్తులు

# ★ ప్రొఫెసర్ పాపారావు ★

శ్లాఘనీయం! కాని ఏంచేస్తాడు పాపం? అతని జ్ఞాపకశక్తే అటువంటిది!

శ్రీమతి యెడల అతనికి గల శ్రద్ధాభక్తులు తెలుసుకోడానికి ఒక్క నిదర్శనం చాలు. ఆ రోజున ప్రొఫెసర్ పాపారావు గంటల తరబడి శ్రీమతి తెమ్మన్న వస్తువేమై ఉంటుందా అన్న ఆలోచనలో గడిపాడు. కాలుగాలిన పిల్లిలా బజార్లన్నీ తిరిగాడు, చేతో ముడి పట్టుకుని ఒకటే దిర్ఘాలోచన! ఎంతకీ తెగందే! ఇంతలో అదృష్టవశాత్తూ తన చెయ్యి జేబులో కాకుండా మెడదగ్గిర ఉందన్న సంగతి అతనికి స్ఫురించింది. మెడ దగ్గిరికి జేబురుమాలెలా వచ్చిందా అని చూసుకుంటే తను ఇంతసేపటినుంచి చేత్తో పట్టుకునివున్నది నెక్ టైకాని జేబురుమాలుకాదని తేలింది! అప్పటికే బ్రతుకుజీవుడా అంటూ పెందరాళే ఇంటికి చేరుకున్నాడు.

ఇటువంటి అనేక సంఘటనలనుబట్టి జేబురుమాలుకి ముడివేసేపద్ధతి శ్రీమతి పూర్తిగా ఎత్తివేసింది.

జేబులో కంకరరాళ్ళ ప్రయోగం మాత్రం ఇంతవరకూ ఎన్నడూ వ్యర్థంగా పోలేదు. ప్రొఫెసర్ పాపారావు స్వభావంలో ఎన్ని లోపాలున్నా ఒక్క సుగుణంమాత్రం అతనిలో కనిపిస్తుంది.

అతను ఎన్నడూ ఎంత అల్పవస్తువునైనా దేన్నీ పనికిరాదని పారేయడు. అతని కోటు జేబులు రకరకాల వస్తువులతో యెప్పుడూ నిండుగా ఉండడానికి కిదేకారణం. యెప్పటివో ఉత్తరాలు ఏవేవో కాగితాలు అతని జేబులలో చేరుతూవుంటాయి. రోజూ వచ్చే ఉత్తరాలు చదువగానే కోటుజేబులలో కుక్కుకోవడం అతనికి అలవాటు. ఉత్తరాలతో పాటు వాటికవరు కూడ జేబులలోకి పోవలసిందే. అంతేకాదు – దిన పత్రికలు, వారపత్రికలు, వాటి రేపరుకూడ వదిలిపెట్టకుండ తన జేబులలోకి తోసేయడానికి అతనేం జంకడు!

పాలబిల్లు–చాకలిపద్దు–లెక్చర్ పాయింట్సు నోటు చేసుకున్న కాగితాలు, కాలేజి నోటీసులు, బస్ ఛాన్సలర్ నుంచి వచ్చే జాబులు, ఒకటేమిటి–ప్రొఫెసర్ పాపారావు చేతికి వచ్చే ప్రతి కాగితం అతని జేబులలోకి చేరుకుంటుంది. ఇంకా చెప్పాలంటే రోడ్డమీద పంచిపెట్టే సినీమా పేపర్లకి–తదితర కర పత్రాలకి కూడ అతని జేబులలో స్థలం రిజర్వుచేసి ఉంటుంది.

ఇల్లా రోజుల తరబడి అతని కోటుజేబులు రకరకాల వస్తువులతో ఊరికే నిండిపోతూ ఉంటాయి. ఆఖరికి ఒకానొక శుభ ముహూర్తాన శ్రీమతి సునిశిత దృష్టి అటు ప్రసరిస్తుంది. ఆమె హస్తాల ద్వారా ఆ జేబులు పూర్తిగా ఖాళీ చెయ్యబడడమే గాక ఆ వస్తువులన్నీ ఏ పెంట కుప్ప మీదనో స్థిర నివాస మేర్పరచుకుంటాయి.

అందుచేతే ప్రొఫెసర్ పాపారావు జేబులోని కంకరరాళ్లు పోతాయనే భయం శ్రీమతికి ఎన్నడూ లేదు. ఆమె అతని కోటు పై జేబు ప్రత్యేకం ఈ కంకరరాళ్ళకోసం రిజర్వు చేయించింది. అంత మరీ అవసరమైతే కొంత డబ్బు కూడ ఆ జేబులో వేసుకోవచ్చును–అంతకి తప్పితే వేరే వస్తువేదీ అందులో ప్రవేశించడానికి ఎంత మాత్రం వీలు లేదు. ఇది శ్రీమతి ఆజ్ఞ!

ఇప్పుడు ఆ జేబులోంచే ఆ అమ్మాయి కంకరరాళ్లు తీసి టేబిల్ మీద పోసింది. అతని జేబులోంచి కంకరరాళ్లు ఎలా వచ్చాయో అన్నది విద్యార్థులందరికీ ఒక పెద్ద తేలని సమస్యఅయి ఊరుకుంది.

ప్రొఫెసర్ పాపారావుకూడ ఈ కంకరరాళ్ల మూక భాష అర్థం చేసుకోలేక తికమకలై పోతున్నాడు. ఇవి తన జేబులో ఎల్లా ప్రవేశించాయన్నది అలవాటు చొప్పున అతనికి జ్ఞాపకం ఉండడంలో ఏం అంత ఆశ్చర్యంలేదు. అయితే ఏ విషయాన్ని జ్ఞాపకంచేసే ఉద్దేశ్యంతో శ్రీమతి తన జేబులో వీటిని ప్రవేశపెట్టిందా అన్నది మాత్రం ఎంత కొట్టుకున్నా అతనికి జ్ఞాపకం రావడంలేదు.

కాలేజి వాతావరణనుంచి బయటపడడంతో ఈ సమస్య ఇంకా తీవ్రరూపం దాల్చి అతన్ని ఎదుర్కొంది. ఈ కంకరరాళ్ళ రహస్యాన్ని ఛేధించకుండా ఇలు చేరుకోడం ప్రస్తుత పరిస్థితులలో ప్రొఫెసర్ పాపారావుకి ఎంతమాత్రం సురక్షితంగా తోచలేదు. ఆలోచించినకొలదీ సమస్య అంతకంతకి జటిలమై పోసాగింది. ఇంటి ముఖం పట్టేందుకు అతని కాళ్లు సుతరామూ ఇష్టపడడంలేదు.

శ్రీమతి తెమ్మన్న వస్తువేదో జ్ఞాపకం చేసుకుని అది కొని ఇంటికి పట్టుకువెళ్లాలనే పెద్ద పట్టింపేమీ, నిజానికి, ప్రొఫెసర్ పాపారావుకి లేదనే చెప్పాలి. అయితే శ్రీమతిని శాంతింపజేయడం ఎల్లా సాధ్యమవుతుందా అనేదే అతని అసలు సమస్య.

ఇంతకిముందు ఒకసారి ఏమి జరిగిందో అతని జేబురుమాలు త్రోవలో ఎక్కడో పడిపోయింది. అసలు జేబురుమాలే ఉండకపోతే దానికి ముడివేసి ఉందో లేదో చూసుకోడానికి? ముడి చూస్తేగాని ఏ వస్తువు ఇంట్లో అవసరముందన్న సంగతి అతనికి తెలియదు కదా? అందుచేతే శ్రీమతి కేసరి పౌడర్ తెమ్మన్న సంగతి అతనికి ఆ రోజున చస్తే జ్ఞాపకంరాలేదు. అది తీసుకు రాకుండానే అతనింటికి చేరుకున్నాడు. ఆ రోజున శ్రీమతి ఏ పాకశాస్త్రపు పుస్తకంలోనో చదివింది — కేసరి రంగువేసి హోటళ్లలో పరమాన్నం చేస్తారని. తను కూడ ఆరంగుతో పరమాన్నం చేద్దామని ఉవ్విళ్లూరుతూన్న శ్రీమతికి ఒక్కసారిగా ఆశాభంగమయింది.

"మరిచిపోతారు లెండి – ఇల్లాగే రోజూ మరిచిపోతూ ఉండండి – బాగానే ఉంటుంది. నేను మా పిన్నిగారింటికి వెళ్లిపోతాను – మీరు మీ ఇష్టం వచ్చినట్లు ఉండవచ్చు."

శ్రీమతి ప్రొఫెసర్ మీద ప్రయోగించే అన్ని అస్త్రాలలోకి పిన్నిగారింటికి వెళ్లిపోతాననే అస్త్రం అతిదారుణమైనది ప్రొఫెసర్ దృష్టిలో అంతకంటే అటం బాంబే నయం.

ప్రొఫెసర్‌లో ఉన్న పెద్ద దౌర్బల్యం ఏమంటే శ్రీమతి లేకపోతే అతనికి ఇంట్లో ఒక్కక్షణంకూడ గడవదు. తను అన్ని విషయాల్లో శ్రీమతి మీదే ఆధారపడి ఉన్నాననే సంగతి మాత్రం మరిచిపోవడం అతనికి చేతకావడంలేదు.

ఇప్పుడీ కంకరరాళ్ల మూకభాషని అర్థం చేసుకోకుండా ఇంటికివడితే ఇంకేమైనా ఉందా? శ్రీమతి తన బెదరింపుని తప్పక ఆచరణలోకి తెచ్చితీరుతుంది. ప్రొఫెసర్ పాపారావు రోడ్డుమీద నడుస్తూనే తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

వెనుకనుండి మోటారు హారన్ వినబడుతుంది. అతను చిక్కుకున్న ఆలోచనా లోకంలోంచి మేల్కొని పేవ్ మెంటు మీదకి చేరుకున్నాడు. పాండీబజారులో పడి గబగబా నడుస్తున్నాడు. బజారు గందరగోళంలోంచి బయటపడి కాసేపు ప్రశాంతంగా పానగల్ పార్కులో కూర్చుందామని అతని ఉద్దేశ్యం. అక్కడి నిర్మలమైన మనస్సుతో ఆలోచిస్తే కంకరరాళ్ల రహస్యం తప్పక పరిష్కారమవుతుందని అతని ఆశ.

సిమెంటు బెంచిమీద ప్రక్కగా హేట్ పెట్టుకుని ఆ చల్లగాలిలో కొంచెంసేపు

ఈ [illegible] ఇంటికి చేరుకుంటే శ్రీమతి [illegible] ప్రొఫెసర్ పాపారావు [illegible]

ష్కంలోని యంత్రం అతితీవ్రంగా పని చెయ్యసాగింది.

ప్రస్తుతం శ్రీమతికి అంతగా అవసరమైన వస్తువు ఏమైవుంటుంది? ఏదేనా మందై ఉంటుందా? అబ్బే, శ్రీమతి ఎప్పుడూ జబ్బుచెయ్యడమంటూ ఉండదే! పోనీ ఏదైనా టానిక్ అవసరమై ఉంటుందా? టానిక్ ఉపయోగించవలసి రావడానికి ఆమె ఏమంత బలహీనంగా ఉందని? అటువంటి దేమీ అయి ఉండదు. లావు తగ్గించుకు నేందుకు మాత్రలు ఏవేనా తెమ్మని ఉంటుందా? ఎంతమాత్రం కాదు. తను లావుగా ఉన్న సంగతి శ్రీమతి ఎన్నడేనా ఒప్పుకుంటే కాగు?

మరి! ఇంకేమీ తెమ్మని చెప్పిఉంటుంది? ప్రొఫెసర్ పాపారావు ఇంకా తీవ్రంగా ఆలోచించాడు. బుజ్జికి బిస్కట్లేనా చాక్లెటేనా తెమ్మని ఉంటుందా? లేకపోతే దేనికి గ్లాసో డబ్బా తెమ్మని చెప్ప ఉంటుందా? అబ్బే ఇవేవీ అయివుండవు. శ్రీమతి బీరువా ఇటువంటి వస్తువులతో ఎప్పుడూ నిండుగా ఉంటుంది కాదూ! ఎంత ఆలోచించినా ప్రొఫెసర్‌కి అంతుచిక్క లేదు. గంటసేపు బుర్రబద్దలుకొట్టుకున్నా ఏం లాభం లేకపోయింది. ఆ నాలుగేదు కంకరం రాళ్లు గృహస్థ జీవితంలో తనకీ శ్రీమతికీ మధ్య హిమాలయ పర్వతపంక్తుల్లా అడ్డుగా నుంచున్నాయి!

ఇంతసేపటినుంచి పానగల్ పార్కులో చల్లనిగాలి అనుభవించినందుకు ఫలితంగా అతని బుర్రకి హఠాత్తుగా ఒక అద్భుతమైన ఆలోచన తట్టింది. భేష్, అనుకున్నాడు. ఇప్పుడు వెంటనే బయలుదేరివెళ్లి బజారులోని దుకాణాలన్నీ పరీక్షించి చూడాలి, అక్కడి రకరకాల వస్తువులన్నీ చూస్తూంటే శ్రీమతి తెమ్మన్న వస్తువేదో సులభంగా జ్ఞాపకం రావడానికి అవకాశం ఉండవచ్చు

ఉద్దేశ్యం కలిగిందే తడవుగా ప్రొఫెసర్ పాపారావు పాండీ బజారు వేపు గబగబా బయలుదేరాడు ఒక్కొక్క దుకాణం దగ్గిర ఆగి ప్రతి వస్తువు కేసీ పరీక్షించి చూసాగాడు.

ముందు ఎదురుగా కనిపించిన ఒక ఫాన్సీ షాపులోకి వెళ్లాడు ఫేస్ పౌడర్, క్రీమ్, స్నో మొదలైన టాయ్‌లెట్‌కి సంబంధించిన వస్తువులన్నీ చూశాడు అతని దృష్టికి అవన్నీ అతి సామాన్యమైన వస్తువులుగా కనిపించాయి. శ్రీమతికి ఇటువంటి పనికి [illegible] [illegible] తోచింది. లిప్‌స్టిక్ మొదలైన కృత్రిమ వస్తువులు శ్రీమతికి కావలసివుంటాయన్న విషయం అతని బుర్ర ఎంతమాత్రం ఒప్పుకో లేదు.

అక్కడినుండి ప్రక్కనే ఉన్న బనారస్ సిల్కు ప్యాలెస్‌కి తోవతీశాడు. అక్కడ ఉన్న రకరకాల పట్టుచీరలు తదితర వస్త్రాలూ అతని దృష్టిని ఎంతమాత్రం ఆకర్షించలేకపోయాయి. శ్రీమతి వార్డురోబ్‌లో ఉన్నన్ని చీరలు నిజానికి అతనికక్కడ కనిపించనే లేదు.

బాటా షూమార్ట్‌లో కూడా అతని సమస్య తీరలేదు ఇంక ఒక్క నగల దుకాణం మిగిలింది. ప్రొఫెసర్ పాపారావు సునిశిత దృష్టికి అక్కడి అలంకారవస్తువు లేవి శ్రీమతికి యోగ్యమైనవిగా కనిపించ లేదు ఆమాటకి వస్తే—క్రిందటినెలలో శ్రీమతి కొనుక్కున్న నెక్‌లెస్‌కి సాటివచ్చే వస్తువేదీ అక్కడ లేనేలేదని అతని దృఢ విశ్వాసం.

ఇంక జనరల్ స్టోర్సు వైపుకి పాపారావు దృష్టి పోనేలేదు. అక్కడి పప్పు ఉప్పు సామ్రగులు శ్రీమతికి ఏవిధంగానైనా ఉపయోగపడమ్మనేమో అన్న అనుమానంకూడ అతనికి కలగలేదు ఇంతకీ శ్రీమతి తెమ్మన్న వస్తువేదో తేలనేలేదు ఇన్ని షాపులు తిరిగినా ఇన్ని వస్తువులు చూసినా ఏమీ లాభం లేకపోయింది. చీకటిపడి చాలాసేపయింది. ఎంతసేపని ఇల్లా తిరుగుతాడు? ప్రొఫెసర్ పాపారావుకి ఇంటిముఖం పట్టడం తప్ప గత్యంతరం లేకపోయింది.

ఇంట్లో అడుగుపెట్టేప్పటంతో ఆటంబాంబు విస్ఫోటం జరుగుతుందనే దృఢ విశ్వాసంతో ఉన్న పాపారావుకి అక్కడి ప్రశాంత వాతావరణం చూసి చాలా ఆశ్చర్యమే కలిగింది. ఇంట్లో ఎక్కడా వడీ చప్పుడూ లేదు వరండాలో, పనిచేసే కుర్రవాడు గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. శ్రీమతి గదిలో ఎక్కడా మనుష్యులున్న అలికిడి లేదు. పరిస్థితులు ఇంత అనుకూలంగా ఉన్నందుకు సంతోషిస్తూ ప్రొఫెసర్ పాపారావు చల్లగా తన గదిలోకి జారుకున్నాడు.

ఇంత రాత్రివేళ ఈ వ్యతిరేక పరిస్థితులలో శ్రీమతిని ముఖాముఖి కలుసుకోడం గాని, ఆమె వేసే పీలూ చాలూ లేని ప్రశ్న పరంపరని ఎదుర్కోడంగాని, తన జ్ఞాపకశక్తివంటి వ్యక్తిగత విషయాల్ని గూర్చి ఆమె ఇచ్చే పెద్ద లెక్చరు వినడంగాని ఆ క్షణంలో ప్రొఫెసర్ పాపారావుకి సుతరామూ ఇష్టంలేదు అందుచేతే చడీ చప్పుడూ లేకుండా అతి పెద్దమనిషి తరహాగా వచ్చి వెళ్లడంతో గదిలో మంచం మీద మేను వాల్చాడు. ఈరాత్రి ఎలాగో గడిచిపోతే మర్నాటి సంగతి చూసుకోవచ్చునని అతని ఉద్దేశ్యం!

ఆ రాత్రి ప్రొఫెసర్ పాపారావు భోజనం చేశాడా లేదా అన్న విషయాన్ని గూర్చి మనమంతగా బాధపడవలసిన అవసరం లేదు. ఎటి విఘ్నబాధలూ లేకుండా ఆ రాత్రి అతను నిద్రపోగలడమే మన మిక్కడ గమనించవలసిన విషయం. అతనికి శ్రీమతి దర్శనం ఆ రాత్రి అవలేదు సరికదా తెల్లారిన తరువాత కూడా కాలేదు. అతనికి అంతవరకు పరిస్థితులు సంతృప్తికరంగానే కనిపించాయి

కాఫీ వేళకి కాఫీతో సహా శ్రీమతి దర్శనం తప్పక అవుతుందనే విషయంలో ఏం సందేహం లేదు కనుక అతను ఆ రాత్రి ఘటనకి సంసిద్ధుడయాడు అయితే కాఫీ వేళ దాటి చాలా సేపయిపోయినా శ్రీమతి దర్శనం కాకపోవడం చూసి ప్రొఫెసర్ పాపారావు జ్ఞాపకశక్తిలో ఎన్నడూ ఎరుగని చంచలనం కలిగింది.

ఇంతకీ శ్రీమతి ఏమైనట్లు? రాత్రినుంచి

(42-వ పేజీ చూడండి)

పి. ఎన్. అరోరా
నిర్మిస్తున్న
"అంజాన్" లో
ఒక నృత్యో
సన్నివేశం



# బొంబాయి సినిమా లేఖ

**25** లక్షల రూపాయల వ్యయంతో పిల్లలకు చలనచిత్రాలు నిర్మించడానికి రూపొందించిన పథకానికి నాందైన ప్రారంభోత్సవం జరిగింది. చిత్రలేఖ, జోగన్, సోహాగ్ రాత్ వంటి చిత్రాలు తీసిన కిదార్ శర్మ తొలిచిత్రానికి నిర్మాత. ఆయనే దర్శకత్వం నిర్వహిస్తారు. ఈ చిత్రం పేరు 'జల్‌దీప్' దాదర్ లోని శ్రీ సౌండ్ స్టుడియోలో జరిగిన ఈ ప్రారంభోత్సవానికి గవర్నరు డా॥ హరేకృష్ణ మెహతాబ్, మాజీ ముఖ్యమంత్రి, పిల్లల చలనచిత్రసంస్థ అధ్యక్షుడు శ్రీ బి. జి. ఖేర్ ప్రభృతులు విచ్చేశారు. బాలచలన చిత్రాల నిర్మాణావశ్యకత గురించి పలువురు ఉపన్యాసాలిచ్చారు.

* * *

చెకోస్లోవాకియాలో ఈ నెల 1వ ప్రారంభమైన అంతర్జాతీయ చలన చిత్రోత్సవానికి బొంబాయి నటీనటులు దర్శక నిర్మాతలూ వెళ్ళారు. ఈ ప్రతినిధి వర్గానికి శ్రీ బిమల్ రాయ్ నాయకుడు. ఆయనకి పెద్ద పేరు తెచ్చి పెట్టిన "దోబిఘా జమీన్" తరువాత ఆయన నిర్మించిన మహత్తర చిత్రం ఏమీ లేదు. ఇప్పుడు చెకోస్లోవాకియాలోనే, తన తరువాతి చిత్రం "మధుమతి"కి ప్రారంభోత్సవం జరుపాలని శ్రీ రాయ్ సంకల్పించారు. "మధుమతి"లో నాయకుడుగా నటించదలచిన్న దిలీ(ప్) కూడా చెకోస్లోవేకియా వెళ్లాడు. ఆ హీరో అందుబాటులోనే ఉంటాడు గ(నుక) ప్రారంభోత్సవం తరువాత, ఆ దేశం(లో) కొన్ని ఔట్ డోర్ దృశ్యాలు "షూ(ట్)" చేయాలని బిమల్ రాయ్ అనుకుంటున్నారు. ఈ రూపేణా, ఆయనకూ, ఆయన చిత్రం "మధుమతి"కీ యూరప్‌లో ప్రచారం జరుగుతుంది.

* * *

భారతప్రభుత్వం ఎడింబర్గ్ చలన(చిత్రో)త్సవంలో పాల్గొనడానికికూడా పెద్ద ప్రయత్నాలు చేస్తోంది.

శ్రీ బి. ఎన్. సర్కార్ నిర్మించిన చిత్రం "చార్ దోస్త్"ను శ్రీమతి ఇం(దిరా) గాంధీ తనతో లండన్ తీసుకువెళ్లా(రు). "చార్ దోస్త్" చిత్రానికి శ్రీ డేవిడ్ హిం(దీ,) ఆంగ్ల భాషలలో వ్యాఖ్యానం వ్రాసి (ఇచ్చా)రు. ఈ చిత్రానికి నితిన్ బోస్ దర్శ(కుడు).

* * *



వాహినీ వారి "భాగ్యరేఖ" లో జమున, రామారావు.

## ★ బొంబాయి సినిమాలేఖ ★

గతివారం విడుదల అయిన ఒక చిత్రం ఏ. ఎం. త్రివేదీ నిర్మించిన "రూప్‌కుమారి". అరేబియన్ నైట్స్ తరహా కథతో తయారైన ఈ చిత్రంలో సాహస కృత్యాలు సంగీత నృత్యాలు, పెద్ద పెద్ద సెట్ లూ పుష్కలంగా ఉన్నాయి. పుష్కలంగా లేనిదల్లా దర్శకత్వంలో ప్రతిభ. ఈ "లేమి" మూలాన చిత్రం కొంత వినోదం కలిగించినా, పేలవంగా అర్థరహితంగా తయారైంది తారాగణం నటన నాటక రంగం మీద బాగా ఒప్పుఉండేదనిపించింది

నాయిక షకీలా నటన మరీ అతిగా ఉంది. ఉన్నవారిలో కాస్త మెరుగ్గా, సమర్థుడుగా కనబడ్డవాడు మహీపాల్ ఒకడే. ఈ చిత్రానికి ప్రత్యేక ఆకర్షణ హాయిగొలిపే సంగీతం.

(ఆంధ్రవారపత్రిక బొంబాయి విలేఖరి)

# పిల్లలకు చలన చిత్రాలు

## ఉపాధ్యాయ సభ సిఫార్సులు

రాష్ట్ర ప్రభుత్వాలు "ఫిలిం లైబ్రరీ" లు నెలకొల్పాలనీ, జిల్లాకొక సంచార 'చలనచిత్ర ప్రదర్శన' కేంద్రమైనా ఏర్పాటు చేసి క్రమంగా నడపాలనీ దృక్ శ్రవణ విద్యాబోధనా వ్యవహారాలు పరిశీలించిన అఖిల భారత ఉపాధ్యాయసభ సిఫార్సు చేశారు. కేంద్రప్రభుత్వం పనుపున ఈ విషయాలు వీరు పరిశీలించారు. హిందీ భాషా వ్యాప్తికి చలనచిత్రాలు బాగా ఉపయోగించగలవనీ, ఇందుకై ప్రత్యేకం చలన చిత్రాలు నిర్మింప చేయడానికి కేంద్ర ప్రభుత్వం పూనుకోవాలనీ కూడా సలహా ఇచ్చారు.

ఇంకా రేడియో ద్వారా, పోస్టర్లు చార్టులూ మొదలైన వాటి ద్వారా, పాఠశాలల్లో నల్లబల్లమీద దైనందిన వార్తలు వ్రాయించడం ద్వారా ఎంత కార్యక్రమం సాగించవచ్చునో సూచించారు

పిల్లలకు విజ్ఞానంతోపాటు వినోదాన్ని సమకూర్చడం కూడా మంచిదనీ, అవసరమనీ, అదీఇదీ జోడిస్తేనే పిల్లలకి ఆసక్తి కలుగుతుందనీ, విన్న విషయాలకన్న, కన్న విషయాలు మనసుకి బాగా హత్తుకుపోతాయనీ పెద్దా చిన్నా అంతా ఒప్పుకోవడం జరిగింది. పిల్లలకై ప్రత్యేకం చిత్రాలు నిర్మించిగాని, విదేశాలనుండి తెప్పించి డబ్ చేసిగాని, విరివిగా ప్రదర్శించాలనుకున్నారు. పిల్లల కోసం ఒక చలనచిత్ర సంస్థకూడా నెలకొల్పారు. జరగవలసిన పెద్ద ప్రయత్నాలలో ముఖ్యమైనది ప్రదర్శనకు వసతులు ఏర్పాటు. ఈ ఏర్పాటు బాగా జరగపోతే, ఎన్ని చిత్రాలు నిర్మించినా, ఎన్ని దిగుమతి చేసినా, ఫిలిం లైబ్రరీలు నెలకొల్పినా పిల్లలకు సంబంధించినంత వరకు, వాటిని ఎలా వారికి చూపించడం అన్నది ప్రశ్నార్థకంగా మిగులుతోంది. సినిమా ప్రొజెక్టరుగల పాఠశాలలను వేళ్ళమీద లెక్క పెట్టవచ్చు. దీనికి సమాధానంగా ఉపాధ్యాయుల సభవారు జిల్లాకొక

"రామదాసు" చిత్రానికి ఇటీవల వీనస్‌స్టుడియోలో ప్రారంభోత్సవం జరిగినపుడు స్వాగతం చెబుతున్న దర్శక నిర్మాత శ్రీ నాగయ్య. ఎడమ చివరనున్నవారు ప్రారంభోత్సవం చేసిన మద్రాసు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నార్, వారిప్రక్కన వీనస్ స్టుడియో అధిపతి.



నరసూవారి హిందీచిత్రం "సితారోంసే ఆగే"లో వైజయంతిమాల, అశోక్‌కుమార్.

సంచార చలనచిత్ర ప్రదర్శనకేంద్రం ఉండాలని సిఫార్సు చేశారు. జిల్లాకొక యూనిట్ ఉంటే దాని వలన జరిగేదేమిటో బోధపడదు. పిల్లలకి సినిమాలు చూపించామంటే చూపా మనదానికన్నట్టు మొక్కు తీర్చుకున్నట్టు చూపించవచ్చునేమో. వాగా నికొక రోజు ఉదయం ప్రతి సినిమా హాలులోనూ పిల్ల చిత్రాలు ప్రదర్శించే ఏర్పాటు చేయవచ్చు. దానికైనా బాల చలనచిత్రసంస్థ విద్యాశాఖాధికారులూ కలసి ఆలోచించి పూనుకోవలసి ఉంది.

చలన చిత్రాలు తయారు చేయించడం, ప్రదర్శన వసతులు ఏర్పాటు చేయడం వేర్వేరు కార్యక్రమాలనీ, ముందొకటి అయితే అనక రెండోది చూచుకోవచ్చుననీ అనుకోవడం ప్రయోజనకరం కాదు.

ఉపాధ్యాయుల సభ ఈ విషయం కూడా ఆలోచించి, వాసవిక దృక్పథంతో ఈ విషయాలు అనుసరణ యోగ్యమైన విధానాలు సూచించడం అవసరం. లేదా ప్రభుత్వం ఇందుకు మార్గాలు ఆలోచించి, విద్యాశాఖల ద్వారా కృషి చేయాలి.

* * *

## లండన్‌లో "పథేర్ పాంచాలి"

మానవ హృదయాన్ని అత్యుత్తమంగా చిత్రించిన కళాఖండంగా సర్వత్రా ప్రశంసలందుకున్న బెంగాలీ చిత్రం "పథేర్ పాంచాలి"ని బ్రిటిష్ ఫిలిం ఇన్‌స్టిట్యూట్ వారు రేపు ఆగస్టులో లండన్‌లోని నేషనల్ థియేటర్‌లో ప్రదర్శించబోతున్నారు.

28 వేలమంది సభ్యులు గల బ్రిటిషు ఫిలిం ఇన్‌స్టిట్యూట్ వారే ఈ థియేటర్‌ను నిర్వహిస్తున్నారు. ఈ సంస్థ ప్రపంచంలోని కళాపోషక సంఘాలలో అగ్రగణ్యమైనది.

"పథేర్ పాంచాలీ" ఆగస్టు 6 నుంచి 8 వరకూ రోజుకు రెండుసార్లు ప్రదర్శిస్తారు.

ఇక్కడ ప్రదర్శించబడలోయే మరో భారతదేశపు చిత్రం క్వాజా అహమద్ అబ్బాస్ నిర్మించిన "మున్నా". దీన్ని ఆగస్టు 12 నుండి 15 వరకూ ప్రదర్శిస్తారు. మెహబూబ్ ప్రొడక్షన్స్ వారి వర్ణచిత్రం "ఆన్"ను కూడా ఆగస్టు నాలుగు శనివారం నాడు ప్రదర్శిస్తారట.

* * *

చలన చిత్రోత్సవాలు:

# భారత డాక్యుమెంటరీకి బెర్లిన్‌లో బహుమతి

భారత ప్రభుత్వం నిర్మించిన డాక్యుమెంటరీ చిత్రం "స్ప్రింగ్ కమ్స్ టు కాశ్మీర్"కు, కెనడా నిర్మించిన "నెత్ మెటిక్" అనే హాస్య చిత్రానికి ద్వితీయ బహుమతి లభించింది. "కాశ్మీరులో వసంత ఋతువు" అనే ఈ చిత్రాన్ని ప్రభుత్వ ఫిలింస్ డివిజన్ రంగులలో తీశారు

డాక్యుమెంటరీలలో ప్రథమ బహుమతి 'పారిస్ ఎలాసీ (పారిస్‌లో రాత్రివేళ)' అనే ఫ్రెంచి చిత్రానికి లభించింది.

కథా ప్రధాన చిత్రాల్లో ఎం జి ఎం. వారి "ఇన్విటేషన్ టు డాన్స్" అనే చిత్రానికి ప్రథమ బహుమతి, సర్ లారెన్స్ ఒలివియర్ నిర్మించిన "మూడవ రిచర్డ్" అనే చిత్రానికి ద్వితీయ బహుమతీ ఇచ్చారు

## జెకోస్లొవేకియా

కార్లోవివారీలో గ్రాండ్ హోటల్ మాస్కోవాలో జులై 13 న ప్రారంభమైన 9 వ జెక్ చలనచిత్రోత్సవం 30 వ తేదీ వరకూ సాగుతుంది ఆహ్వానాలందుకొన్న 48 దేశాలలో 41 పైచిలుకు అంగీకరించి 40 ఫీచర్ (కథా ప్రధాన) చిత్రాలూ, 100



జూపిటర్ వారి "ఉమాసుందరి"లో పేకేటి శివరాం.

చిన్న చిత్రాలు (హాస్య చిత్రాలు, డాక్యుమెంటరీలు, కార్టూన్లు, మొదలైనవి) పంపాయి మొట్టమొదటి జెక్ ఉత్సవంలో 7 దేశాలే పాల్గొన్నాయి 1954 లో 8 వ చలన చిత్రోత్సవంలో 30 దేశాలు పాల్గొన్నాయి యూరప్‌లో ఇంత పెద్ద ఉత్సవానికి ఇదే తొలిసారి. దీనికి జెక్ విద్యామంత్రి డా॥ కహూదా ప్రారంభోత్సవం చేస్తూ, దేశదేశాల ప్రజలమధ్య మైత్రి పెంపొందచేయడమే ఈ ఉత్సవలక్ష్యమన్నారు.

మనదేశం పంపిన చిత్రాలు బిమిల్ రాయ్ నిర్మించిన 'దేవదాస్', దేవకీబోస్ నిర్మించిన 'భాలాబోషా' (బెంగాలీ) ప్రభుత్వ ఫిలింస్ డివిజన్ నిర్మించిన డాక్యుమెంటరీలు "టుమారో ఈజ్ అవర్స్" ("రేపు మనదే"), "చిట్టిరాయబారులు" (లిటిల్ ఎంబాసెడర్స్), భారత్ దర్శన్ భారత ప్రతినిధిగా శ్రీ హెచ్. వి. ఆర్ అయ్యంగార్ వెళ్లారు

వివిధ దేశాలనుండి ఆహ్వానింపబడ్డ 50 మంది పత్రికా విలేఖరులలో ఇద్దరు భారతీయులున్నారు.

## డమాస్కస్‌కు రెండు చిత్రాలు

సెప్టెంబరులో జరుగనున్న డమాస్కస్ (సిరియా) చలనచిత్రోత్సవానికి మనదేశం నుండి రెండు కథాప్రధాన చిత్రాలు, రెండు డాక్యుమెంటరీలు పంపిస్తున్నారు. అవి సోహ్రాబ్ మోడీ నిర్మించిన "మిర్జా గాలిబ్" (1954 లో రాష్ట్రపతి సువర్ణపతకం బహుమతి పొందినది), సత్యేన్‌బోస్ నిర్మించిన "బందిష్"

ఫిలింస్ డివిజన్ నిర్మించిన గేవాకలర్ చిత్రం "చిట్టి రాయబారులు", మరో డాక్యుమెంటరీ "తుంగభద్ర".

మనదేశం పాల్గొనబోతున్న మరో రెండు చలనచిత్రోత్సవాలు, వెనిస్, ఎడింబర్గ్‌లో జరిగేవి. వెనిస్ ఉత్సవానికి రాజ్ కమల్ కళామందిర్ వారి "తూఫాన ఔర్ దీయా"ను పంపిస్తున్నారు. ఇందుకోసం దీన్ని 9 వేల అడుగులకు కుదించి, ఇటాలియన్ భాషలో "సబ్ టైటిల్స్" వ్రాయించి అమర్చుతున్నారు. వాటివల్ల కథ తెలియదేమోనని, అవసరమైనచోట్ల వ్యాఖ్యానం కూడా జోడించాలని ఆలోచిస్తున్నారట. పోతే, ఈ చిత్రంలో పాటలు తీసివేస్తారట.

పర్కార్ ప్రొడక్షన్స్ వారి బెంగాలీ చిత్రం "సాహెబ్ బీబీ గోలం"ను కూడా వెనిస్ చలన చిత్రోత్సవానికి పంపాలని ప్రభుత్వం నిశ్చయించిందట ఒక ధనిక కుటుంబం ఆధారంగా గత శతాబ్దాంతంనాటి బెంగాలీ సమాజాన్ని ఇందులో చిత్రించారు. రచయిత శ్రీ బిమల్ మిత్ర. శ్రీ కార్తిక్ చటర్జీ దీనికి దర్శకుడు. సుమిత్రాదేవి, ఉత్తంకుమార్ పాల్గొన్నారు ★

## ఆర్టిస్ట్స్ అండ్ మాడల్స్

"టెలివిజన్ వాళ్ళని చూస్తే ఎంతో ముచ్చటవేస్తుంది. వాళ్లని చూసి బుద్ధి తెచ్చుకో. గంటసేపు ప్రదర్శించే కథలో వాళ్లు కనీసం పది ఖూనీలు చూపిస్తున్నారు. కత్తితో పొడిచి, పీకకి తాడు బిగించి, ఇంకా సరికొత్త పద్ధతులలోను, చక్కగా ఎన్నో రకాల హత్యలను చిత్రించగలుగుతున్నారు ఇలా వాకిలి రక్తపు మడుగు చేసి, కళ్లు చెదిరిపోయేటు అద్భుతమైన దృశ్యాలు చూపిస్తున్నారు అవన్నీ చూడమరిగిన కుర్రసజ్జ నీ బొమ్మలపుస్తకం ఎలా చూస్తుంది? ఛీ. సిగ్గుచేటు. వంద పేజీల పుస్తకంలో ఒక్కటంటే ఒక్క హత్య చూపిస్తావా? ఎందుకొచ్చిన ఆర్టిస్టువయ్యా!"

"హారర్ కామిక్స్" అనబడే జాతి పుస్తకాలను కోకొల్లలుగా ముద్రించి, దేశం అంతా వదచల్లే ఒక ప్రచురణకర్త, ఒక చిత్రకారుడిని సున్నితంగా మందలిస్తూ, గట్టిగా జుట్టు పీక్కుంటూ, చేసిన నయబోధ ఇది.

పారమౌంట్ వారి "ఆర్టిస్ట్స్ అండ్ మాడెల్స్" అనే చిత్రంలో ఈ తరహా "సాంస్కృతాన్ని" చక్కని వ్యంగ్య ధోరణిలో నిశితంగా దుయ్యబట్టారు. ఈ రకం పుస్తకాల ప్రభావం విపరీతంగా పెరిగిపోయింది ఇవి మనదేశానికి కూడా కోకొల్లలుగా వచ్చిపడ్డాయి దరిమిలా ఈ పుస్తకాలను నిషేధిస్తూ ప్రభుత్వం శాసనం చేసింది ఇప్పుడు వీటి విలువ ప్రాధాన్యం మరింత హెచ్చాయి దొరకని సరుకులు కాబట్టే, వీటిని చదవమరిగిన పాఠకలోకం, ప్రాచీన తాళపత్ర గ్రంథాలకు మల్లె వాటిని అతి పదిలంగా కాపాడుకుంటూ, ఎరువిచ్చినా అతిజాగ్రత్తగా మళ్ళీ రాబట్టుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు. అమెరికాలో ఈ కట్టుదిట్టం కూడా లేదు. నిషేధించాలన్న ఉద్యమం మాత్రం ఉంది.

అక్కడ పిల్లలపై వీటి ప్రభావం ఎంతగా ఉందో ఇందులో ఈ చిత్రంలో చూపించారు. పదేళ్ల కుర్రవాడు, అచ్చంగా ఈ పుస్తకాలలో వాళ్లు మాట్లాడే తీరులో నే ముదరమాటలు మాట్లాడుతాడు. "నాకు రక్తపాతం చూడడం ఇష్టం" అంటాడు.

కథలో ప్రధానపాత్రకూడా ఈ కోవకు చెందినదే. ఏళ్లు ముదిరినా మనసు వికసించని ఒక శ్రి వెంగళాయ (జెరీలూయిస్) అభూమిక ఈ వెంగళాయ, హారర్ కామిక్స్ విపరీతంగా చదివేశాడు. నిద్రలోకూడా ఆ దృశ్యాలనే కలగంటాడు. వాటిలో మాటలే కలవరిస్తాడు.

ఈ పుస్తకాల తత్వం బాగా వంటబట్టి పోయినందువల్ల అతగాడికి, స్వంతంగాకూడా దారుణమైనవూహాలు బోలెడు కలుగుతాయి. కలలో రకరకాలఘోరదృశ్యాలు చూడగలగుతాడు. తెల్లవార్లు, వాటిని వర్ణిస్తూ కలవరిస్తూ కథలు చెబుతూ మధ్య మధ్య గావుకేకలు పెడుతూ ఉంటాడు.

మామూలుచిత్రాలు అంటే మంచి చిత్రాలు, వేస్తే చెల్లుబడికాక, తిండికి డబ్బు దొరకక బాధపడే ఒక చిత్రకారుడు ఇతనికి జతగాడు. చివరికి వెర్రివెంగళాయ కలలూ, కలవరింతలూ అతనికి ఉపాధి చూపిస్తాయి. రాత్రి తెల్లవార్లు మేలుకుకూర్చుని, జతగాడు కలవరించే కథలన్నిటినీ, ఇతగాడు వ్రాసుకుని, అతగాడి వర్ణనలు ఆధారంగా ఘోరాతిఘోరమైన దృశ్యాలన్నీ బొమ్మల్లో చిత్రిస్తాడు. డబ్బు పుష్కలంగా లభిస్తుంది. ఒకసారి జతగాడి కలవరింతలో వినబడ్డ ఒక గొప్పసూత్రాన్ని ఒక అణాకానీ పుస్తకంలో ఇతడు ఎక్కించివేస్తాడు. అది కథలో ఒక రాకెట్‌ను నడిపే సూత్రమే అయిన, వాస్తవానికి, ప్రభుత్వం పరిశోధనలు జరిపించి కనుక్కుని అతిగుప్తంగా ఉంచుకొన్న ఒక నికార్సైన సూత్రంగా తయారై ఊరుకుంటుంది అక్కడినించి మామూలు కామెడీ కథలాగే (ఇలాటివి ఇతఃపూర్వం స్టాన్‌లారెల్, అలివర్ హార్డీల చిత్రాలలోను, అమెరికన్ జంటబడ్ ఎబాట్, లూకాసైలోల చిత్రాలలోనూ కనబడ్డవే) డీన్‌మార్టిన్ జెరీలూయిస్‌ల జంట కులాసాగా కథని అడంగి చేర్పుతుంది.

దుష్టప్రవృత్తులను కలిగించి, పెంచి, పోషించి పెద్దచేసే సారస్వతం వాచులాగా వ్యాపించిపోకుండా, అరికట్టడానికి యథాశక్తి ప్రయత్నించే ఈ తరహా చిత్రాలు, ఆ తరహా సారస్వతం పెరిగి పెచ్చుమీరే ఏ దేశంలో నైనా ఆదరణ యోగ్యములే. ఇతఃపూర్వం ట్వంటీయత్ సెంచరీ ఫాక్స్ నిర్మించిన "సెవెన్ ఇయర్ [illegible]

చవకబారు సారస్వతాన్ని దుయ్యబట్టారు. మనదేశంలో వినోదంతో పాటు, నిర్మాణాత్మకమైన విమర్శను మేళవించి, విసుగెత్తకుండా ఆహ్లాదం కలిగించేవిధంగా ఈ తరహాలో చిత్రాలు నిర్మించడానికి యత్నం చేయడం వాంఛనీయం. ★

## చలనచిత్ర పరిశ్రమ చిరవాంఛితం

చలనచిత్ర పరిశ్రమలో వారిని ఆదుకోవటానికై పెట్టుబడి సంస్థ ఒకటి ఏడాదిలోగానే అవతరించబోతోంది. ప్రస్తుతానికి ప్రభుత్వం పాతికలక్షలు అప్పు ఇస్తారట. దిగుమతి అయే ముడిఫిలింపై అడుగుకు అరపైస (నయాపైసా కాదు) చొప్పున సెస్సు విదేశాలలో తయారైవచ్చే చలనచిత్రాలపై అడుగుకు రెండణాల చొప్పున సుంకం విధించడం ద్వారా మరో పన్నెండులక్షలు వసూలుచేసి దీనికి కలుపుతారట. ఆపైన క్రమక్రమంగా ఈ పెట్టుబడి కార్పొరేషన్ మూలధనాన్ని కోటిరూపాయలకు పెంచుతారట.

భారత చలనచిత్ర పరిశ్రమ ప్రభుత్వాన్ని సహాయం కోరినపుడు, వినోదం పన్ను ద్వారా వసూలయే డబ్బులో కొంతపరిశ్రమకు మళ్ళించి పెట్టుబడి కార్పొరేషన్ ఏర్పాటు చేస్తారని ఆశించారు కానిఇపుడు పథకం ప్రకారం, ప్రభుత్వం పాతికలక్షలు అప్పుగా ఇస్తోంది. మరో పన్నెండు లక్షల కోసం అవలంబించే మార్గాలలో దిగుమతి అయే ముడిఫిలింపై అరదమ్మిడీ సెస్సు వేయడం ఒకటి. ఇది నిర్మాతలపై అదనపు భారం పడవేయడమే అవుతుంది. ఫిలిం విచారణ సంఘం సేకరించిన వివరాల ప్రకారం మామూలుగా ఒక ఫీచర్ చిత్రానికి 7 లక్షల 50 వేల అడుగుల ముడి ఫిలిం కావలసి ఉంటుందని తేలింది.

ఇది 18 వేల అడుగుల చిత్రాలకి వేసిన లెక్క.

దక్షిణభారతంలో ఇంకా పద్దెనిమిది వేల అడుగుల యుగం పోలేదు. పరిగదా వర్ధిల్లే ధోరణిలో ఉంది. ఈ లెక్కన మన వేపు నిర్మాత ఒక చిత్రం నిర్మించడానికి నెగటివ్ అరవై డెబ్భై వేలనుండి లక్ష పైచిలుకు అడుగులు కావాలి, పోతే పరిశ్రమలో పోటీలమూలంగా, వచ్చే డబ్బులో నాలుగు త్వరగా రాబట్టుకోడానికి, ఎక్కువ ప్రతులు తీసి విడుదల చేస్తున్నారు. (ఏ. వి. ఎం. వారి "నాగులచవితి" 125 ప్రతులు తయారైనట్టు వినికిడి) దానా దీనా, దక్షిణభారతంలో నిర్మాతలు వాడే ఫిలిం 8 లక్షల అడుగులకు పైనే ఉంటుంది. ఈ లెక్కన, దీనిపై [illegible]

8 వేల రూపాయల పైచిలుకు 1949-50 లో దిగుమతి అయిన ముడిఫిలిం 17 కోట్ల అడుగులు ఈ లెక్కనమాస్తే ఈ రూపేణా వసూలయేది ఏడారు లక్షలుంటుంది పోతే విదేశీ చిత్రాలపై అడుగుకు రెండణాల సుంకంవేస్తే ఎనిమిదినుండి పదిలక్షలవరకూ లభిస్తుంది.

పోను పోను దీని పెట్టుబడిని కోటి రూపాయలకు పెంచడంఅంటే, ఇప్పుడు ముడి ఫిలింమీద సెస్సులాగే చిన్న చిన్న వడ్డింపులు జరుగుతాయేమో.

పోతే ఈ కార్యక్రమం పేరిట, నిర్మాణ సలహాసంస్థ, ఫిలిం ఇన్‌స్టిట్యూట్, నెలకొల్పుతారు. వీటి కార్యకలాపాలను, సెన్సారు సంఘాన్ని సమన్వయించి వ్యవహారాలు నడపడానికై జాతీయ ఫిలింసంస్థ ఒకటి స్థాపిస్తారట. ★

## ప్రమాదో ధీమతామపి?

జూలై 8 వ తారీఖున శ్రీ సౌండ్ స్టుడియోలో బాల చలనచిత్రం నిర్మించే కొత్త చిత్రానికి పెద్ద ఎత్తున ప్రారంభోత్సవం జరిగింది. అశోక్ వర్మ, రాజేంద్ర దూబే, ప్రీతిబాల అనే ముగ్గురు పిల్లలు తొలిరోజు షూటింగులో పాల్గొన్నారు. బొంబాయి గవర్నరు, శ్రీ మెహతాబ్, బాల చలనచిత్రసంస్థ అధ్యక్షుడు, మాజీమంత్రి అయిన శ్రీ బి. జి. ఖేర్ మొదలయిన పెద్దలంతా వచ్చారు. అంతా బాగుంది కాని, ఈ చిత్రానికి పేరు పెట్టడంలో కొంత పేచీ ఉన్నట్లు కనబడుతోంది. దీనికి చేసిన నామకరణం "లైట్ హౌస్." అయితే ఈ పేరును ఇంతకుముందే స్వతంత్ర నిర్మాత శ్రీ జి పి. సిప్పీ ముచ్చటపడి ఏరుకుని, దాన్ని నిర్మాతల సంఘంలో రిజిస్టరు చేయించుకున్నారు అందులో అశోక్‌కుమార్, నూతనసమర్థ్ నటిస్తున్నారు. ఈ వైనం తెలిసో తెలియకో ప్రభుత్వం నెలకొల్పిన బాల చలనచిత్ర సంస్థ తమ చిత్రానికి "లైట్ హౌస్" అనే పేరు పెట్టుకున్నారు. పిల్లలకోసం అనే నిర్మించినా, ఈ రంగంలో ఇది కొత్త

([illegible] పేజీ చూడండి)

డిటెక్టివ్ సీరియల్

మూలం: ఎడ్గార్ వాలెస్

# అరుణవలయం

అనువాదం: "ప్రద్యుమ్న"

## 28. హత్యా ప్రయత్నం

ఇన్‌స్పెక్టర్ పార్ వయస్సు దగిరిదగ్గిరిగా యాభై ఉంటుంది. అతనికే ఇంత వయస్సు ఉంటే అతని నాయనమ్మ ఎంత వృద్ధురాలై ఉండాలా అని జాక్ ఆశ్చర్యపడ్డాడు. పైగా ఆ నాయనమ్మకు అపరాధ పరిశోధనలోను, ఇల్లు చక్కదిద్దడంలోనూ అంత శ్రద్ధ ఉండడం మరీ ఆశ్చర్యకరం!

"మీ నాయనమ్మ చాలా చిత్రమైన మనిషై ఉండాలి ఆవిడకి అరుణవలయం నేరాలన్నీ తెలుసునా?" అని జాక్ అడిగాడు.

"తెలుసునా అని అడుగుతున్నావా? బలే వాడివి. ఆమె కనీసం నాకున్నంత అధికారహోదాతోనూ అరుణవలయం ముఠాను వేటాడగలిగితే ఈపాటికి వాళ్ళంతా జైలు కటకటాల వెనకాల ఉండేవాళ్ళు, ఆమెకి అధికారం లేదుగనక గాని—"

ఆరాత్రి పార్ నుంచి హుషారుగా ఉన్నాడు. జాక్‌తో అరమరిక లేకుండా చాలా విషయాలు చెప్పేస్తున్నాడు పోలీసు కమీషనరు తన్ను తిట్టిన సంగతి కూడా దాపరికం లేకుండా చెప్పేశాడు.

"ఈ నేరాలన్నీ ఇలా నిరాటంకంగా జరిగిపోవడం మా పోలీసుశాఖవారికి తలవంపులుగా ఉన్నది గడచిన యాభై ఏళ్ళుగా ఎప్పుడూ ఇలాంటివి జరగలేదు. అసలు 'రిపర్ హత్యల' తరవాత ఇంత దారుణమైన హత్యాకాండ ఎప్పుడూ జరగలేదనుకుంటాను. ఒక ముఠాను చేరదీసి కట్టుదిట్టంగా, క్రమబద్ధంగా నేరాలు చేయడం గడచిన యాభై ఏళ్ళలో ఇదే మొదటిసారి అరుణవలయం మనిషెవడో గాని చాలా అసాధ్యుడు. మామూలుగా హంతకుల ముఠాలన్నీ తేలికగా, తొందరగా పట్టుబడిపోయే రకములే. కాని ఈ అరుణవలయం వ్యక్తి ఎవర్నీ నమ్మడు. వాణ్ణి ఎవడూ పట్టివ్వడు, పట్టివ్వడం సాధ్యం కాదు గనక. ముఠాలోని ఇతరులుకూడా ఒకరినొకరు పట్టివ్వలేరు, ఎందుకంటే ఒకరినొకరు ఎరగరు గనక, అంత కట్టుదిట్టంగా నడుస్తోంది ఈ వలయం."

ఆ తరవాత పార్ తాను పట్టుకున్న ఎన్నో పాతకేసుల కథలన్నీ చెప్పడం మొదలెట్టాడు. రాత్రి పదకొండున్నర అయింది. జాక్ వెడతానని మళ్ళీ ఇంకోసారి లేచాడు.

"ప్రొద్దుపోయింది, ఇక వెళ్ళు. నిన్ను గుమ్మం దాకా సాగనంపుతాను. నువ్వు కారులో వచ్చావుగదూ బియర్డ్ మోర్?"

"కాదు, టాక్సీలో వచ్చాను."

"అలాగా ఇందాక మా గుమ్మం ఎదుట ఒక కారాగినట్లు చూశానే మా ఇంటి చుట్టుప్రక్కల కారుగల ఆసాములెవరూ లేరే ఎవరన్నా డాక్టరు వచ్చాడేమో"

పార్ తలుపు తీశాడు. గుమ్మానికి కవతలగా నిజంగా నల్లకారొకటి ఆగి ఉంది.

"ఎక్కడో, దీన్ని చూసినట్టు జ్ఞాపకం," అంటూ పార్ ఒక అడుగు ముందుకు వేశాడు. ఇంతలో చీకటిగా ఉన్న కారు అంతర్భాగంలోంచి మెరుపు మెరిసినట్లు కాంతి వెలువడింది. పిడుగుపడినంత శబ్దం వచ్చింది. ఇన్‌స్పెక్టర్ పార్ జాక్ చేతులోకి పడిపోయి, నేలకొరిగాడు. మరుక్షణంలో కారు అమిత వేగంతో మాయమైపోయింది చుట్టుప్రక్కల ఇళ్ళవాళ్ళు తుపాకి ధ్వనికి మేలుకుని తలుపులు తీసి బయటికి వచ్చేసరికి కారు సందుమలుపు దాటి వెళిపోయింది.

ఎక్కడినుంచో పోలీసొకడు పరుగెత్తుకు వచ్చాడు. ఇన్‌స్పెక్టరును లేవనెత్తి భోజనాల గదిలోకి తీసుకు వెళ్ళారు. పార్ మేనత్త అప్పటికే నిద్రపోయినట్లుంది. ఆమెకు ఈ గొడవ ఏమీ తెలియలేదు

పార్ కళ్ళు తెరిచి చుట్టూ చూశాడు. "అబ్బా" అని బాధగా మూలిగాడు కోటు లోపలకు చేయిపోనిచ్చి ఒక పిస్తోలు తూటా బయటకి తీశాడు. "ఆటోమాటిక్ ఆయుధం కాదన్నమాట అయితే వచ్చేవాణ్ణే" అని జాక్ కేసి చూశాడు. జాక్ ఏమిటిదంతా అన్నట్లు తెల్లమొహం వేశాడు. పార్ బాధతో నేనవ్వాడు

"తుపాకిదెబ్బ తగలని వేస్ట్‌కోటు ధరించేవాళ్ళు ముగ్గురే ఉన్నారు. ఒకడు అరుణవలయం, వ్యక్తి. రెండోవాణ్ణి నేను. మూడో మనిషి" అని ఆగి "థాలియా డ్రమండ్—" అని పార్ చెప్పాడు.

మరికొంతసేపటివరకూ పార్ మాట్లాడకుండా పడుకుని ఉన్నాడు. తరవాత "డెరిక్ యేల్‌కు ఫోను చేస్తావా? ఈ సంగతి తెలిస్తే కంగారుపడతాడేమో" అని జాక్‌తో చెప్పాడు.

హత్యాప్రయత్నం జరిగిన అరగంటకి డెరిక్ యేల్ తొందరతొందరగా, సరిగ్గా డ్రెస్సు చేసుకోకుండా ఎలా ఉన్నవాడు అలా వచ్చేశాడు. పార్ చెప్పినదంతా విన్నాడు.

"మిస్టర్ పార్! నిన్ను నేను కించపరచడం కాదుగాని, ఇంతమందిమి ఉండగా నిన్నే ఎందుకు హత్య చెయ్యాలని హంతకులు ప్రయత్నించారో తెలియడం లేదు" అన్నాడు యేల్.

పార్ ఛాతీమీద దెబ్బ తగిలిన చోట మందు రాసుకుంటూ మౌనంగా ఉన్నాడు.

"నిన్ను కించపరచాలనికాదు నా ఉద్దేశం. నిన్ను హత్య చేయ ప్రయత్నించడమంటే పోలీసుశాఖను యావతునూ సవాలు చెయ్యడమన్నమాటే అంత సాహసం చేస్తారనుకోలేదు" అని కనుబొమలు చిట్లిస్తూ యేల్ యింకా యిలా అన్నాడు: "థాలియా డ్రమండ్‌కు ఏమవసరం వచ్చిందా అని నేను అనుమానించాను ఇవాళ ఉదయం ఆమె నీ అడ్రెసు కావాలని అడిగింది నీ పేరు టెలిఫోను బుక్కులో గాని, డైరెక్టరీలో గాని లేదుగదూ?"

"నువ్వేమన్నావు?"

"నేను సరిగా సమాధానం ఇవ్వలేదు. కాని నా ప్రైవేటు అడ్రెసు పుస్తకం బయటనే ఉన్నది. అది చూస్తే నీ అడ్రెసు తేలికగా దొరుకుతుంది మరి నన్నెందుకడిగిందా అని ఆశ్చర్యంగా ఉంది."

ఇది విని జాక్ విసుగుతో నిట్టూర్పు విడుస్తూ అన్నాడు:

"మిస్టర్ యేల్! మిస్ డ్రమండ్ వచ్చి ఇన్‌స్పెక్టరుమీద పిస్తోలు పేల్చిందనా మీరు అనుమానించేది? మీరు నిజంగా అను

మానిస్తున్నట్లయితే అది అర్థంలేని అనుమానం. నాకు తెలుసు మీరనబోయేది. ఆమె ప్రవర్తన మంచిది కాదనీ, ఇదివరకు చిన్న చిన్న నేరాలు చాలా చేసిందనీ కదూ? ఏవో నేరాలు చేస్తే, హత్య కూడా చెయ్యాలని ఎక్కడుంది?"

యేల్ కొంతసేపు మౌనం వహించాడు. "నువ్వు చెప్పింది నిజం, మిస్టర్ పియర్ పోర్! ఆమెను తొందరపడి అనుమానించినట్లున్నాను. అన్నట్టు పార్! ఇవాళ రాత్రి నిన్ను చూద్దామని అనుకున్నాను," అంటూ జేబులోంచి ఒక కార్డు తీసి ఇన్‌స్పెక్టరు ముందు బల్ల మీద పెట్టాడు. "వీళ్ళ ధైర్యం చూడు, ఎంతవరకూ పోయింది?"

"ఎప్పుడు వచ్చిందిది?"

"ఉత్తరాల పెట్టెలో పడి ఉంది. నేను నీ దగ్గిరికి బయలుదేరుదామని టాక్సీ కోసం పరుగెత్తుతూ, తపాలా పెట్టె ఎందుకో తెరిచి చూశాను. ఇది కనిపించింది. బ్రహ్మాండంగా లేదూ?"

కార్డుమీద చిహ్నం పరిచితమైనదే. కాని అరుణవలయాన్ని చూడగానే జాక్ జలదరించాడు. వలయం మధ్యలో ఇలా ఉంది:

"నువ్వు ఓడిపోతున్న పక్షాన పనిచేస్తున్నావు. మా తరఫున పనిచేస్తే నీకు బాగా లాభిస్తుంది. నువ్వు ఇప్పటిలాగానే పని సాగించావంటే, వచ్చే నెల నాలుగో తేదీ తరవాత నువ్వు ఉండవు."

"అంటే, నీకింకా పది రోజులు గడువు వుందన్న మాట," అని పార్ గంభీరముగా అన్నాడు. బాధవల్లనో, ఉద్రేకంవల్లనో అతని ముఖం ఆ క్షణంలో వివర్ణమైపోయింది. "పది రోజులు" అని అస్పష్టంగా గొణుక్కున్నాడు.

"ఈ బెదిరింపుకు నేనేమీ భయపడడం లేదు" అని డెరిక్ యేల్ ఉత్సాహంగా అన్నాడు.

"నా ఆఫీసులో ఆనాడు జరిగిన సంఘటన తరవాత ఈ హంతకులవద్ద నిజంగా అలౌకిక శక్తులున్నాయేమో ననిపిస్తోంది."

"పది రోజులు!" అని ఇన్‌స్పెక్టరు మళ్ళీ అన్నాడు. "అయితే మరి నువ్వేం చేద్దామనుకుంటున్నావు? మామూలుగా అయితే, వచ్చే నెల నాలుగో తేదీని నువ్వెక్కడుంటావు?"

"ఎందుకలా అడుగుతావు? నా స్నేహితుడొకడు మోటారులాంచి ఒకటి ఇచ్చాడు. అది తీసుకుని ఆ రోజు రాత్రి ఇంగ్లీషు ఛానెల్‌లో చేపలు పడుతూ గడపాలని నా అసలు కార్యక్రమం. ఆ రోజునే బయలుదేరాలని అనుకున్నాను."

"నువ్వు ఏమనుకున్నా సరే, నిన్ను ఆరోజున ఒంటరిగా పోనిచ్చేది లేదు," అని పార్ ఖండితంగా అన్నాడు. "సరే, ఇక మీరంతా వెళ్ళండి. మా మేనత్త నిద్రపోవడం వల్ల, మా నాయనమ్మ ఇంట్లో లేక పోవడం వల్ల బతికిపోయారు."

ఈ ఆఖరు ముక్క జాక్‌తో అన్నాడు. జాక్ గ్రహించినట్లుగా చిరునవ్వు నవ్వుతూ లేచాడు.

## 29. "ఎర్రవలయం"

తను ప్రపంచంలో యెవర్నీ నమ్మనని హార్వే ఫ్రాయంట్ గర్వంగా చెప్పుకునేవాడు. హెగిట్ కంపెనీ లాయరును కొంత దూరందాకా మాత్రం విశ్వసించాడు. ఆపైన విశ్వసించదలుచుకోలేదు. ఆ కంపెనీకి అనుమానాస్పదులైన వారితో సంబంధాలుండడం అతనికి తెలుసు కనుక, పూర్తిగా విశ్వసించ రాదని అతడు భావించాడు.

ఇన్‌స్పెక్టర్ పార్ పై ఖూనీ ప్రయత్నం జరిగిన రెండు రోజుల పిమ్మట లాయర్ హెగిట్ హార్వే ఫ్రాయంట్ వద్దకు వచ్చాడు. బ్రబజాన్ వద్దనుండి అరుణవలయం తీసుకున్న బ్యాంకి నోట్లను అతడు కొంతవరకూ ఆరాతీయ గలిగాడు.

"మిస్టర్ ఫ్రాయంట్! ఈ పద్ధతిని అనుసరించి మనం ఆరాతీస్తూపోతే, తప్పకుండా మొట్టమొదట్లో బ్యాంకి నోట్లను మార్చినవాణ్ణి పట్టుకోగలం," అన్నాడు హెగిట్.

కాని హార్వే ఫ్రాయంట్ తన నిర్ణయం మార్చుకోలేదు. కేసును పూర్తిగా ఈ లాయరు చేతిలో పెట్టి ఊరుకోవడానికతడు ఇష్టపడలేదు. ఇంకా ఆరాతీయవలసిన భాగాన్ని తనే ఆరాతీస్తాడు. ఈ విషయం ఫ్రాయంట్ చెప్పేశాడు కూడాను.

"మీరు ఈ కేసులో నన్ను పని చెయ్యనివ్వకపోవడం ఏమీ బాగాలేదు. ఈ అన్వేషణ నాకెంతో ఉత్సాహకరంగా ఉంది. మరికొన్ని విషయాలు తెలిస్తే, ఆ వలయం మనిషిని ఇట్టే పట్టి ఇవ్వగలను," అన్నాడు హెగిట్.

కాని హార్వే ఫ్రాయంట్ ఒప్పుకోలేదు.

ఫ్రాయంట్‌ను గూర్చి జాక్ ఫ్రయాగ్ మోర్ చెప్పింది అక్షరాలా నిజమే. తను పోగొట్టుకున్న ధనం యావత్తూ తిరిగి సంపాదించే దాకా అతడు నిద్రపోడు. ఈ విషయంలో అతనిప్పుడు ఏకాకం పట్టే. అతడు ప్రపంచంలోని ప్రతి దేశంలోనూ క్రయవిక్రయ వ్యాపారం చేసి గోల్డు ఆస్తి కూడబెట్టాడు. మొదట్లో అతని వద్ద చిల్లిగవ్వయినా ఉండేదికాదు. కాని అహోరాత్రాలు కష్టపడి వ్యాపారం అభివృద్ధి చేసి కొన్ని లక్షల ఆస్తి కూడబెట్టాడు. ఏదో ఆఫీసులో కూర్చుని, అంతా ఉద్యోగులకు వదిలేసి, ఆర్జించలేదు. స్వయంగా అనేక దేశాలు తిరిగి, అనేకులతో వ్యవహారాలు జరిపి వ్యాపారం చేశాడు.

అలాగే ఈ కేసును కూడా స్వయంగా పరిష్కరించ దలుచుకున్నాడు. పార్‌తో గాని, యేల్‌తో గాని తన ప్రయత్నాల విషయమై ఏమీ చెప్పలేదు.

లాయరు హెగిట్ చెప్పినట్లు, దొరికిన బ్యాంకినోటును మూడుదశల వరకూ ఎవరెవరి చేతులు మారిందో తేలికగా ఆరాతీశాడు. మొదట ఒక వడ్డీ వ్యాపారస్థుడి వద్దకూ, తరవాత ఒక టూరిస్టు కార్యాలయానికి, మూడోసారి ఒక పెద్ద బ్యాంకికీ ఆ నోటు నిమిత్తం వెళ్ళాడు. ఈ బ్యాంకి ఫ్రాయంట్ వ్యాపారం చూచిపెట్టే బ్యాంకి తాలూకు బ్రాంచి కావడంవల్ల పని సులభంగా జరిగిపోయింది.

మూడు రోజులపాటు కూర్చుని పరిశోధించాడు. అనేక ప్రశ్నలు అడిగాడు. అనేక పుస్తకములు వెదికాడు. బయట వారెవరూ చూడకూడని ప్రైవేటు అక్కౌంటు కూడా శోధించాడు. చివరికొక నిర్ణయానికి వచ్చాడు. మొట్టమొదటగా నోటును మార్చిన వ్యక్తిని తెలుసుకోవడంతో అతనికి



# అరుణవలయం



తృప్తి కలగలేదు. ప్రైవేటు అక్కౌంట్లు చూడనిచ్చిన బ్యాంకి మేనేజరుకు కూడా ఫ్రాయంట్ ఎందుకీ పరిశోధనలన్నీ చేస్తున్నాడో తెలియలేదు.

ఆతరవాత ఫ్రాయంట్ తొందరతొందరగా ఫ్రాన్సుకు ప్రయాణమై వెళ్ళాడు. పారిస్‌లో రెండు గంటలు మాత్రమే వున్నాడు. ఆ రాత్రి అతడు దక్షిణానికి ప్రయాణమయ్యాడు. పొద్దున తొమ్మిదింటికి అతడు టులూజ్ నగరం చేరాడు. అక్కడకూడా అతనిపని సులభంగానే జరిగింది. నగర అధికారులలో ఒక ప్రముఖునికి ఫ్రాయంట్‌తో వ్యాపార సంబంధమైన పరిచయం ఉంది. ఆ ప్రముఖుని పేరు ముష్యూర్ బ్రసార్డ్. మళ్లీ వ్యాపారం నిమిత్తమే ఫ్రాయంట్ వచ్చాడనుకుని బ్రసార్డ్ సంతోషంతో స్వాగతమిచ్చాడు. కాని అసలు విషయం తెలిసే సరికి అతని ఉత్సాహమంతా పోయింది.

"నేను ఇలాంటి విషయాల్లో జోక్యం చేసుకోను. నేను లాయరు నైనప్పటికీ క్రిమినల్ కోర్టుతో నాకు సంబంధం లేదు," అన్నాడు బ్రసార్డ్. పొడుగాటి గడ్డం నిమురుకుంటూ సాలోచనగా, "మార్లో నాకు బాగా తెలుసు. వాడితోపాటు మరొక ఇంగ్లీషువాడు కూడా ఉండేవాడని గుర్తు," అన్నాడు.

"వాడి పేరు వైట్‌మన్ కదూ?"

"అవును, ఆ, వాడే," అని అసహ్యభావంతో కనుబొమలు ముడిచి "ఆ ఉదంతం అందరికీ తెలిసిందే. అంత గజదొంగల్ని నేనెక్కడా చూడలేదు. నైమ్సుబ్యాంకిలో క్యాషియర్‌ను, కాపలావాణ్ణి ఖూనీ చేశారు. టులూజ్‌లో రెండు హత్యలు చేశారు. వాళ్ళ పేర్లు నాకు బాగా జ్ఞాపకం ఉన్నాయి. అదీగాక భయంకరమైన మరో సంఘటనకూడా జ్ఞాపకం ఉంది," అన్నాడు బ్రసార్డ్.

"ఏమిటది?" ఫ్రాయంట్ కుతూహలంతో అడిగాడు.

"వైట్‌మన్‌కు మరణదండన విధింపబడింది. వాణ్ణి మారణయంత్రం వద్దకు తీసుకు వెళ్ళారు. యంత్రాన్ని పనిచేయించే వాళ్లు బాగా తప్పతాగి ఉన్నారనుకుంటాను. మూడుసార్లు మీట నొక్కి మారణఖడ్గాన్ని వదిలిపెట్టారు. మూడుసార్లు ఆ ఖడ్గం వాడి మెడవరకూ వచ్చి ఆగిపోయింది. చుట్టూ మూగిన ప్రేక్షకులు మీది మీదికి పరుగెత్తుకు వచ్చారు. వైట్‌మన్‌ను మళ్లీ తొందరగా జైల్లోకి తీసుకుపోయారు. లేకపోతే అవాళ పెద్ద గలభా జరిగేదే. అవిధంగా 'ఎర్రవలయం' శిక్ష తప్పించుకున్నాడు."

"ఎవరూ?" ఫ్రాయంట్ అరిచాడు. బ్రసార్డ్ తెల్లబోయిచూశాడు. "ఏమిటి, ఎందుకలా కంగారుపడతారు?" అని అడిగాడు.

ఎర్రవలయం పేరు వినగానే ఫ్రాయంట్ అదిరిపడి లేచాడు. తాగుతూవున్న కాఫీ కిందపడి తివాచీఅంతా పాడైంది

"ఎర్రవలయమా? అంటే?" అని ఫ్రాయంట్ మళ్లీ రెట్టించాడు.

"వాడే వైట్‌మన్ అని చెప్పలా, వాడే. కావలిస్తే మా గుమాస్తా మీకు వివరంగా చెప్పగలడు. అతణ్ణిపిలుస్తానాగండి."

బెల్ మోగించాడు. ఒక వృద్ధుడు హాజరయ్యాడు.

"జూల్స్! నీకు ఎర్రవలయం జ్ఞాపకం ఉన్నాడా?"

వృద్ధుడు తల ఊపాడు. "బాగా జ్ఞాపకం ఉన్నాడు. వాణ్ణి వధ్యస్థానానికి తీసుకు వచ్చినప్పుడు నేనక్కడే ఉన్నాను. అబ్బ, ఎంత భయంకరమైన సంఘటన!" అని వృద్ధుడు నిలువునా కంపించిపోయాడు.

"వాడికి ఎర్రవలయం అని ఎందుకు పేరు వచ్చింది?" అని ఫ్రాయంట్ అడిగాడు.

వృద్ధుడు మెడచుట్టూ చూపుడు వేలుతో ఒక గీత గీశాడు. "వాడి కంఠంచుట్టూ ఈ మాదిరిగా ఒక ఎర్రనివలయం ఉండేది. అది ఎర్రని పుట్టుమచ్చ అనుకుంటాను. అలాంటి పుట్టుమచ్చ ఉన్నవాడిని కత్తి తాకలేదని, దాంట్లో ఆ మహిమ ఉందనీ ఒకనమ్మకం ఉండేది. వధ్యస్థానానికి నేను చాలా మందితో కలిసి వెళ్లాను. అందరూ అదేమాట అన్నారు, వాణ్ణి చంపడం ఎవరితరమూ కాదని. నిజానికి ఆరోజున గిలటిన్ యంత్రాన్ని వాళ్లు సరిగ్గా అమర్చలేదు. వాళ్లు బాగా తప్పతాగి ఉన్నారు. కత్తి సరిగ్గా పడలేదు. మూడుసార్లూ అలాగే జరిగింది."

ఫ్రాయంట్ విభ్రాంతుడై ఈకథఅంతా వింటున్నాడు. కొద్దికొద్దిగా అతనికి రహస్యం తెలియవస్తోంది.

"చివరికి వాడేమయ్యాడు?" అని అడిగాడు.

"నాకూ తెలియదు" అన్నాడు జూల్స్. "ఏదో ద్వీపాంతరం పంపించారట. మార్లోను మాత్రం వదిలిపెట్టారు. వాడు ప్రభుత్వం తరఫున సాక్ష్యంఇచ్చాడు. అందుకని వాణ్ణి వదిలేశారు. వైట్‌మన్ తప్పించుకు పారిపోయాడని కొంతకాలం క్రిందట విన్నాను. ఎంతవరకూ నిజమో తెలియదు."

వైట్‌మన్ పారిపోయి ఉండాలని

(55-వ పేజీ చూడండి)

# వనితాలోకం

## అది నాకు తెలుసు

ఒక గృహస్థుకు పొరుగింట గారెల ఉపాహారము లభించింది. ఆయన అంతకు పూర్వము గారెల రుచి యెరుగడు. మొట్టమొదటిసారిగా లభించిన ఆ పిండివంట రుచి కాయన అపరిమితానందభరితుడై, తన భార్యకు కూడా గారెలు చేసే విధానాన్ని నేర్పవలసినదని ఆ యిల్లాలిని కోరాడు. అనుకొన్నట్లుగా ఆ మరునాడు భార్యను ఆమెవద్దకు పంపాడు. ఆ యిల్లాలు ఆమెను ఆప్యాయంగా పలుకరించి, దగ్గర కూర్చుండబెట్టుకొని, గారెలు చేసే విధానాన్ని చెప్పబోయింది.

"అమ్మాయీ! మినుములు చేటలోపోసి బాగుచెయ్యాలి" అన్నది.

"అది నాకు తెలుసు" అన్నది అతడి భార్య.

"మినుములు విసరి పప్పు చేసి నానబొయ్యాలి"

"అది నాకు తెలుసు"

"పప్పు నానిన తరువాత రోటిలోపోసి రుబ్బాలి"

"అది నాకు తెలుసు."

ఈ మాటతో పొరుగింటావిడకు విసుగు పుట్టింది. 'ఏది చెప్పబోయినా తనకు తెలుసుననుకుంటున్న ఆవిడ తన దగ్గరికి రావటమెందుకు' అనుకొని "అమ్మాయీ! నీకంతా తెలుసునంటున్నావుగా! వెళ్ళి చేసుకో!" అన్నది అంతిమాస్త్రము. తెలియకపోతుందా అనుకొన్న గృహిణి ఇంటికి వచ్చి, తత్ప్రియత్నములో నిమగ్నురాలయిపోయింది. గృహస్థు వచ్చిన తరువాత, ఆమె ఆ క్రొత్త పిండివంటను గరిటతో పళ్లెములో వడ్డించి ఆయన ముందర పెట్టింది. పళ్లెము చూడగానే గృహస్థు విస్తుపోయాడు. "నేను పొరుగింటగారెలను కొరుక్కొని తిన్నానుగాని జుర్రుకోలేదు" అనుకొని, చక్కగా తెలిసికోకుండా పని ప్రారంభించి పదార్థాలను పాడుచేసినందుకు భార్యను మందలించాడు; పొరుగింటికి వెళ్ళి "ఏమండీ! గారెలు ఎట్లా చేయాలో నా భార్యకు మీరు సరిగా చెప్పలేదేమి?" అని నిష్ఠురమాడాడు. దానికి సమాధానముగా ఆమె 'నేను ఏది చెప్పబోయినా ఆవిడ 'అది నాకు తెలుసు' అంటూ వచ్చింది. ఆమెకు నేనేం చెప్పగలను' అన్నది. అప్పటినుంచీ ఇదిఒక సామెతగా వ్యవహరింపబడుతున్నది. ఇది సహస్రరూపాలు ధరించి నిత్యజీవితములో మనకు ప్రతిసందర్భములోను ప్రత్యక్షమవుతూ ఉంటుంది.

ఇల్లిందల సరస్వతీదేవి

దీనిలో రెండురకాలు మనకు కనబడుతాయి. తెలిసికోబోయేటప్పుడు అంతా తెలిసినట్టుగానే అనిపించటమూ, నిజానికి ఏమీ తెలియకపోవటమూ ఒకరకము. విషయము తెలిసినా క్రియ శూన్యంగావటము రెండవరకము.

ప్రతిఇల్లాలికీ తన సంసార బాధ్యతలు తెలుసు. వాటిలో నేర్పు తెలుసు. కుటుంబములో తన స్థానము తెలుసు. ధర్మపత్నిగా నిర్వహించవలసిన విధులూ ధర్మాలూ ప్రతిస్త్రీకి గ్రాహ్యమే. సంసార నిర్వహణ, బిడ్డల బాధ్యతలు అందరూ ఎరిగినవే. కాని తెలిసినట్టు చేతలలో కనుపించదు. కనుక నే 'బిడ్డలను జాగ్రత్తగా పెంచాలి బిడ్డల ప్రవర్తనకు పరిసరాలుకూడా కొంతవరకూ కారణము. వాళ్ల మనసు అతిసుకుమారంగా, అమాయకంగా ఉంటుంది. బిడ్డల స్వభావాలను జాగ్రత్తగా పరిశీలించి తత్వశాస్త్ర

దృష్ట్యా తల్లులు మసలుకోవలసి ఉంటుంది. బిడ్డలను క్రమశిక్షణలో పెంచదలచుకొన్న తల్లులుకూడా వాళ్ల స్వభావాల కనుగుణంగా నడుచుకోవలసి వస్తుంది' అని ఎవరయినా చెప్పితే, చాలామంది స్త్రీలు 'ఈ సంగతి మాకు తెలియదా? తెలియకుండానే ఇంత మందిని పెంచామూ?' అని తటాలున జవాబిస్తారు. కాగా 'ఇవన్నీ తెలిసికొనే మన వాళ్లందరూ పిల్లలను పెంచుతున్నారా? మన తల్లులూ అమ్మమ్మలూ ఈ శాస్త్రాలు తెలుసుకొన్నారా? వాళ్లు బిడ్డలను పెంచలేదా? వాళ్ల బిడ్డలు పెరిగి పెద్దవాళ్ళయి ప్రయోజకులు కాలేదా? అయినా ఈ శాస్త్రాల ననుసరించి పెంచబడిన పౌరులు ఏమంత సభ్యతగా మెలగుతున్నారు?' అని ఎదురు ప్రశ్నిస్తారు.

దేహారోగ్యము కాపాడుకోవాలని అందరికీ తెలుసు. ఆరోగ్యమే మహాభాగ్యమనీ తెలుసు. తల్లి ఆరోగ్యము బాగా ఉంటే బిడ్డల ఆరోగ్యముగూడా చక్కగా ఉంటుందని అందరూ ఎరిగినదే. ఇల్లాలికి ఆరోగ్యము సరిగా లేనట్లయితే ఇంటికి కళాకాంతులు నశించి మాంద్యమేర్పడుతుందనీ అనుభవములోని విషయమే. కాని మన దేశములో ముఖ్యముగా ఆంధ్రుల కుటుంబాలలో స్త్రీల ఆరోగ్యము అధమస్థితిలో ఉన్న నిదర్శనాలు అనేకము. తన భార్య ఆరోగ్యము హీనదశలో ఉన్నదని గృహస్థుడికీ తెలుసు; ఇంటిల్లిపాదికీ తెలుసు. కాని కుటుంబినులు అనారోగ్యానికి ధనాభావముకంటె అలసత్వమూ అజ్ఞత్వమూ కారణాలుగా కనబడుతూ ఉంటాయి.

సంఘములో వరకట్న దురాచారము కొన్ని దశాబ్దాలనుండీ మనను పీడిస్తున్నది. కుటుంబగౌరవమూ ప్రతిష్ఠా, సంప్రదాయమూ వ్యక్తుల విలువలూ ధనరాసుల ముందర గణ్యతకు రావటములేదు. వివాహాలు కేవలము ధన ప్రధానముగా నిశ్చయింప బడుతున్నాయి. ఈ దురాచారము వల్ల అనేక కుటుంబాలు నేల మట్టమయి పోతున్నాయి; జాతి నిర్వీర్యమయి పోతున్నది. దీనివల్ల కలుగుతున్న అపారమయిన నష్టము అందరికీ తెలిసినదే. అనుభవైక వేద్యమే కాని- ఎవరి కొమార్తె వివాహాలు తటస్థపడినప్పుడువారు యథేచ్ఛగా- నిరంకుశంగా ప్రవర్తిస్తున్నారు. ఈ సందర్భాలలో స్త్రీలపైన నేరము మోపే పురుషులూ, పురుషులమీద నెపము వేసే స్త్రీలూ ఉన్నారు.

'వ్యక్తుల విలువలనుబట్టి గౌరవించాలి గాని భోగ భాగ్యాలనుబట్టి కాదు బుద్ధీ, తెలివీ, సౌశీల్యమూ ప్రధానమయినవి గాని ఉద్యోగాలు హోదాలు కావు' అని వేమన్న పద్యాలు సుమతీ శతకము అయిదు బడులు రాగానే కంఠతః చెప్పుకోవటము చాలామంది అనుభవము. ఆ చిలుక పలుకులను అందరూ వల్లించుతూనే ఉంటారు. కాని వాస్తవముగా ధనవంతులకూ, హోదా గల వారికీ దాసోహమ్మనని వారు తక్కువ. వారి నందరినీ ఆశ్రయించుకొని, అనుసరించుకొని తిరిగి లాభము పొందచూసేవారు అనేకమంది; వారు ఆడించినట్లు ఆడేవారు పెక్కుమంది; వారిని తప్ప మరొకరిని పలుకరించని వారూ గౌరవించనివారూ చాలామంది.

'స్త్రీలను గౌరవించాలి. స్త్రీలకు సమాన హక్కులు ఇవ్వాలి. అన్ని రంగాలలో స్త్రీలకు ప్రవేశము కల్పించాలి. వారికి సమాన వేతనాలు లభింపచేయాలి. ఉద్యోగాలలో శాసనసభలలో స్త్రీల సంఖ్యను అధికము చేయాలి. కుమారుడితో పాటు కుమార్తెకు కూడా సమాన భాగము పంచాలి. మన రాజ్యాంగ చట్టాన్ననుసరించి అధికారాలలోను హక్కులలోను జాతి కుల మత భేదాలు ఉండకూడదు. ఎక్కువ తక్కువ భావాలు ఉద్భవించకుండా బాలబాలికలకు బాల్యమునుండి క్రమశిక్షణ యివ్వాలి'— మొదలయినవన్నీ బహుళ ప్రచారమయిన విషయాలు. పట్టణాలలోనూ పల్లెలలోనూ ఆబాలగోపాలమూ వల్లించగల అంశాలు. కాని కుమారుడితో పాటుగా కుమార్తెను పెంచటమన్నది అన్ని కుటుంబాలలోనూ జరుగుతున్నదా? బాల బాలికల పెంపకములో పురుషుడి ఆధిక్యతకు ప్రాముఖ్యమునివ్వనివారే కొద్దిమంది కనబడుతున్నారు. కుమారుడితో పాటు కుమార్తెకు ఆస్తిలో సమానభాగము ఇచ్చేవారు ఎందరుంటారో చెప్పలేము. ఎన్నికలలో స్త్రీలను గెలవనీయకుండా రెండు

# ★ అది నాకు తెలుసు ★

చేతులతో ధనము కొల్లగొట్టి ఓట్లు సంపాదించిన పురుషులను మనము లెక్కపెట్టలేము. పైపై తీయటి మాటలేగాని వాస్తవముగ స్త్రీలను గౌరవించేవారిని వేళ్ళమీద లెక్కించవలసే వస్తుంది. అటువంటివారు ఎవరో—ఎక్కడో—ఎందరో వున్నట్లుగా భావించవలసినదే.

భార్యకు సమాన గౌరవమూ, స్వాతంత్ర్యమూ ఇవ్వాలని పురుషులకందరికీ తెలుసు. గౌరవమూ ప్రేమా ఇచ్చిపుచ్చుకోవాలని అందరూ ఎరుగుదురు. లేనిపోని— అధికారాలను భార్యలమీద చలాయించకూడదని అందరూ గ్రహించినవారే. ఇంటి వ్యవహారాలలో అనేకవిషయాలు స్త్రీలచేత నిర్వహింపబడితేనే రాణిస్తాయని ఎరిగినవారే. కాని ఆచరణలో వీటినన్నిటినీ సాధించగలిగినవారు కొద్దిమంది మాత్రమే. దాక్షిణ్యముతో గౌరవమూ ప్రేమా సంపాదించాలని చూసేవారు అనేకులు. కట్టుకొన్న భార్యలను తను కోపతాపాలకు గురిచేసేవారు బహుళ సంఖ్యాకులు. స్త్రీల శక్తిసామర్థ్యాలను గ్రహించి వాటిని రాణింపచేయటానికి తగు అవకాశాలను కల్పించగల భర్తలు అల్పసంఖ్యాకులు.

సభ్యత ఔచిత్యము ఎవరెరుగని విషయాలు? 'అవి పదిమంది కలిసినప్పుడు జ్ఞాపకము చేసుకోదగినవి కావు. ఉపన్యాసాలకు వాక్యాలని పేర్చే ఊతపదాలు కావు. అవి మన ప్రవర్తనలో అంతర్గతమయి, జీవితాలను ప్రకాశవంతము చేసి ఉన్నతదశకు తీసుకొని పోజాలినవి:' అని అక్షరాస్యులందరూ గ్రహించగలుగుతున్నారు. కాని నిత్యజీవితములో సభ్యత ఔచిత్యము ఎంతమందివద్ద మనము చూడగలుగుతున్నాము? స్త్రీ పురుషులు సమిష్టిగా మెలిగే రంగాలలో ఈ అంశాలు ఎంతవరకూ పాటింపబడుతున్నాయి? మిశ్రమ సమావేశాలలో ఎందరు పురుషులు వీటిని గమనిస్తున్నారు? నాటకాలలో చిత్రప్రదర్శనాలలో స్త్రీల గౌరవము ఎంతవరకూ కాపాడబడుతున్నది? సాహిత్యములో లాక్షణికులు 'పాత్రోచితి', 'ఔచిత్యము' అని నొక్కి నొక్కి వక్కాణిస్తారే—వారు పాటించిన ఔచిత్యము స్త్రీలకెంత గౌరవము కల్పించింది?

నిరాడంబర జీవనమూ ఉన్నత భావచింతనమూ మానవులను ఉన్నతస్థితికి తీసుకొనిపోయేవి. ప్రజాజీవితములో ఈవిధమైన మార్పు తీసుకొని రావలెనని ఎందరో కృషి చేశారు. మహాత్ముడు ఈ రెండిటి కొరకు తన జీవితములో కృషిచేసి సాధించాడు. ప్రజలకు బోధించాడు. ఈ దృష్టితో ఆదర్శ గ్రామాలను కేంద్రాలనూ నెలకొల్పాడు. మితవ్యయానికి ప్రాముఖ్యత నిచ్చాడు. మహాత్ముని సాన్నిధ్యములో తిరిగి ఆయన అడుగుజాడలలో నడుస్తున్నామనుకొనే వారిలో ఎంతమంది వీటిని పాటించగలిగారు? సమావేశాలలో సభలలో ఆదర్శాలకెంత—ఆడంబరాల కెంత ప్రాముఖ్యత?

ఇవన్నీ మనకు తెలుసుననుకొన్న వాటిలో కొన్ని మాత్రమే.

ఈవిధముగా పరిశీలించి చూస్తే అందరికి అన్నీ తెలుసు. అందరికీ ఉత్తమజీవిత పథానికి కావలసిన సాధన సంపత్తి కరతలామలకముగా కనబడుతుంది. నైతికాదర్శాలు నాలుకమీదనే ఆడుతూ ఉంటాయి. స్వర్గలోకము కనుచూపుమేరలో ఉంటుంది. మనకు అన్ని విషయాలూ తెలుసు. కానియకపోయినా కొన్ని విషయాలు తెలిసినట్టుగానే ఉంటాయి. కనుకనే ఎదటివారు ఏది చెప్పబోయినా వినిపించుకోలేము. ఈ కారణముచేతనే తెలిసినవాటినైనా తెలిసినంతవరకయినా ఆచరణలో పెట్టటానికి ముందడుగు వేయలేక పోతున్నాము. ఆర్థిక సాంఘిక విద్యా వైజ్ఞానికముగా అనుకొన్నంతగా పురోగమించలేక పోతున్నాము.

ఈ అలసతకు మూలమేది? ప్రతిదీ తెలుసునన్న భావము దేనివల్ల కలుగుతున్నది? దీనిని నశింపచేయుటెట్లా? నిత్య జీవితములో ఈభావము స్త్రీల పురోగమనానికి ఎంత అవరోధముగా ఉన్నది? ఈ జిజ్ఞాసను పెంపొందించుకొని 'అహం' ను నశింపచేయగలిగితే ఉభయులు కుటుంబాభ్యుదయాన్నీ తద్వారా జాతియొక్క అభ్యుదయాన్నీ కాంక్షించిన వారవుతారు. ★

# ప్రొఫెసర్ పాపారావు

(27-వ పేజీ తరువాయి)

ఇప్పటివరకూ కనిపించక పోడానికి కారణమేమై ఉంటుంది? ఇంక తనే స్వయంగా శ్రీమతికోసం ఇల్లంతా వెతకడం అతనికి తప్పనిసరిగా కనిపించింది. కాని ఎంత గాలించినా అతనికి శ్రీమతిదర్శనం కాలేదు. పనిచేసే కుర్రాణ్ణి అడిగి తెలుసుకోడం తప్ప అతనికి గత్యంతరం కనిపించలేదు.

ఆ పరిస్థితిలో ప్రొఫెసర్ పాపారావు మస్తిష్కంలో ఒక్కసారిగా ఆటంబాంబు విస్ఫోటం జరిగినట్లయింది. సుషుప్త్యావస్థలో ఉన్న అతని జ్ఞాపకశక్తిలో అద్భుతమైన చైతన్యం కలిగింది. ఆ దెబ్బతో తన జేబులో కంకరరాళ్లు ఉండడానికి గల కారణం అతని హృదయంలో మెరుపు మెరిసినట్టుగా తళుక్కుమంది.

ఇంకేముంది! శ్రీమతి పిల్లలతో సహా పిన్నిగారి ఊరు వెళ్ళింది. ప్రొద్దుటే ఎక్స్‌ప్రెస్‌కి తనేగా వాళ్ళని సెంట్రల్‌లో రైలెక్కించాడు! ఊరు వెళ్ళేముందు శ్రీమతి ఈ కంకరరాళ్లు తన జేబులో వేసింది— ఎందుకు?-శ్రీమతి ఊరు వెళ్ళిన విషయం మరిచిపోక జ్ఞాపకం పెట్టుకోమనీ-అనవసరంగా ఎక్కడా తిరక్కుండా డైరెక్టుగా కాలేజినుండి ఇంటికి చేరుకోమనీ-ఇంటికి రాగానే కుర్రాడిచేత కాఫీ తెప్పించుకుని త్రాగమనీ-మరిచిపోకుండా హోటల్ నుంచి కేరియరు తెప్పించుకుంటూ రెండు పూట్లా భోజనం చేస్తూండమనీ, రాత్రిళ్లు ఏదో పుస్తకం పెట్టుకుని తెల్లవార్లూ జాగారం చేయక పెందరాళే నిద్రపోతూ ఉండమనీ-ఇత్యాది దైనందిన జీవితంలో ఈ పదిరోజులూ తాను నిర్వర్తించవలసిన అనేక కర్తవ్యాలని తనకు జ్ఞాపకం చెయ్యడానికి! ★

# వనభోజనం

"అదొక కాలం! వెర్రికాలం!"

వెర్రేమిటి! కాలమేమిటి! అని చాలమందికి ఆశ్చర్యం కలగవచ్చు. అసలు నేనుకూడా మా నరసయ్య మామ నోటిగుండా ఆమాటలు విన్నప్పుడు విస్తుపోయినమాట వాస్తవం!

"అదేమిటి మామయ్యా! చరిత్రలోనైతే హిందూ యుగమనీ మహమ్మదీయయుగమనీ యేవో వున్నాయని విన్నాను. కానీ ఈ వెర్రికాలంసంగతి నేనెప్పుడూ వినలేదే!" అన్నాను.

నా సందేహానికి సమాధానంగా వెర్రికాలమేదో వుదహరించి నరసయ్యమామ అందుకు కారణాల్ని గూడా విపులీకరించి చెప్పాడు.

ధాత కరువులోనట మా నరసయ్యమామకు నూనూగుమీసాలు వస్తూ వస్తూ వున్నాయట! కరువు, కరువు అన్నమాటేగానీ అప్పుడు రూపాయకుపన్నెండుపళ్ల రంగూను నూక దొరికేదట! అప్పటికి మా ప్రాంతంలో రైళ్లూ, బస్సులు లేకపోవడంవల్ల మా నరసయ్యమామ గిత్తల్ని కొనుక్కురావడానికి పలమనేరు పశువుల పరసకు నడిచేవెళ్లేవాడట! ఎక్కడో మా వూరికి ఆమడదూరంలో వున్న మల్లేశ్వరుడికోనలోనుంచీ ఆరు మూరల పొడుగున్న పగిదూలాల్ని తనొక్కడే భుజంమీద మోసి తెచ్చి యింటిదగ్గర దింపేసేవాడట!

ఆ పగిదూలాల్ని ఈరోజుల్లో ఏ యువకుడైనా ఎత్తి భుజంమీద పెట్టుకుంటే తన బావినీ పొలాన్ని వాడికి విక్రయం చేసిస్తానంటూ సవాలు విసురుతాడు నరసయ్యమామ.

అతడి బావినీ, పొలాన్నీ ఆశించిగాకపోయినా ఈ తరంవారి ప్రతిష్ఠను నిలబెట్టడానికైనా కొందరు వస్తాదులు ముందుకురావచ్చుగదా! ఊఁహు రారే!

"మీ వల్ల నేమౌతుందిరా బాబూ! అదొక కాలం! వెర్రికాలం! చింతకాయతొక్కు నంజుకుంటూ ఒక దుత్తెడు అంబలి మజ్జిగతో కలిపి త్రాగి పార చేతబట్టి పొలంలో వంగితే మళ్లీ మధ్యాహ్నానికే తల పైకెత్తేవాళ్ళం. బండిలో నాలుగుగోనెల బెల్లంవేసి సునాయానంగా చక్రంతిసి కొగను పైకెత్తి కండెన వేసుకునేవాళ్ళం. ఇప్పుడా తిండీలేదు. పనీలేదు."

మా నరసయ్యమామ భోజనప్రియుడు. గుక్కెడు కాఫీనీళ్ళతో మధ్యాహ్నందాకా పూటకి బిగబట్టుకొనగల నాగరికులకు అతడి భోజనప్రియత్వం అర్థంగాదు. ఐనా నరసయ్యమామ యిప్పుడేం తింటున్నాడు గనుక! అతడి భోజనసౌఖ్యం నాగమ్మత్తతోనే పోయింది. చచ్చి స్వర్గంలోవుంది ఆ యిల్లాలు! తన భర్తకే పదార్థం రుచో, ఏ ఏ కాలంలో అతడు ఏదేది తినాలని వాంఛిస్తాడో ఆవిడకు తెలుసు. ఈ కోడళ్ళకేం తెలుసు! వాళ్ళు పల్లే, పట్నమూగాని పేటకొంపలనుంచీ చదువూ గిదువూ కొంత ఒంట బట్టించుకుని నరసయ్య కాపురానికి దిగుమతయ్యారు. వాళ్ల కెంతసేపూ కాఫీలు, పెసరట్లలాంటి పిట్టమేతల గొడవేగానీ మామగారి భోజనం సంగతి ఏంపట్టింది! వాళ్ళ ధోరణి గమనించి నరసయ్యమామ కూడా తన కదీ, యిదీ తినాలనుందని కోడళ్ళకు పురమాయించడం మానుకున్నాడు. లేదంటే ఆ వెర్రికాలంలో తనకు నాగమ్మ చేసిపెట్టిన వంటకాల్ని తలచుకుంటూ సంతృప్తి పడుతుంటాడు.

మొన్నే గడచిపోయింది గదూ ధనుర్మాసం. ఆ ధనుర్మాసాన్నే నరసయ్యమామ పండుగనెల అంటాడు. ఆ పండుగనెలలో ఒక తమాషా జరిగింది.

ధనుర్మాసం ప్రారంభం కాగానే నరసయ్యమామ కోడళ్ళిద్దరూ తెల్లవారు ఝామునే స్నానాలు చేసి



సర్పరాజు

—ఫొటో: ఎ. ఎల్. కాంతారావు

## ★ వనభోజనం ★

పూజా పురస్కారాలు చేయసాగేరు. ఎక్కడాలేనంత భక్తి వాళ్ళకా నెలమొదలు కావడంతోటే కలిగింది!

ఎవరి భక్తి వాళ్ళది. వాళ్ళ భక్తితో నరసయ్యమామకు ప్రసక్తిలేదు. కానీ ఆనెల పొడుగునా యింట్లో శాకాహార నియమం పాటించబడాలంటే ఎలాగ? చిక్కంతా అక్కడే వచ్చింది మా నరసయ్యమామకు!

పండుగ నెల రాబోతోందనగా నరసయ్యమామ కాయలా పడి లేచాడు. ఇక బ్రతకడనే అనుకున్నారు. బ్రతికాడు. కానీ మనిషి మాత్రం బాగా చిక్కిపోయాడు. ఐనా అతడు ఏగంట నడుస్తుంటే మాకందరికీ చచ్చినవాడొకడు మళ్లీ బ్రతికి వచ్చినంత సంబరం కలిగింది.

కాయలానుంచీ తేరుకోగానే నరసయ్యమామ పెద్దకొడుకును పిలిచి "ఒరే బాబూ! కోతకు పెట్ట కోడి ఏదైనా వుందేమో చూడు" అన్నాడు.

కొడుకు నేరుగా భార్య దగ్గరికి వెళ్ళి "చూడూ! మా నాన్నగారికి నాలుక చవి చెడిపోయినట్టుంది. కోడిపెట్ట వుందేమో చూడమంటున్నాడు" అన్నాడు.

రత్నమ్మమండిపడింది. "పండుగ నెలలోకూడా ఆ పాపిష్టిపని చేయక పోతే ఏమండీ! ఈ నెల రోజులు కాస్త వూరుకోమనండి! వనలపండుగ నాటికి ఎలాగ వుండనేవుందిగదా!"

ఆ మాటలు నరసయ్య మామ చెవులదాకా వచ్చాయి. అతడు

బాలగేయం:

# నా[illegible] చేసిన పని

పణతుల రామచంద్రయ్య

నాయుడుగారింటిలోన
నారిగాడు నౌకరు
అదోరకం మనిషివాడు
అమాయకుడు పాపము!

నాయుడుగారొకరోజున
నలుబది మామిడిపండ్లను
గంపలోనమర్చి నారి
గాడి నెత్తికెత్తెను.

"ఈ పండ్లను మాకుమార్తె
యింట నిచ్చి ర"మ్మంటూ
నాయుడుగా రొక జాబును
నారిగాడి కిచ్చెను.

దారిలోన నారిగాడి
నోరు ఊరి పోవసాగె
కడకొక వృక్షము చాటున
గంప దించి వేసినాడు.

కనిపెడుతుందనుకొని జా
బు నొక గోతిలోన పూడ్చి
పసందైన పండ్లు రెండు
భక్షించెను నారిగాడు.

తిరిగీ జాబును బయటికి
తీసి—గంప నెత్తిన పె
ట్టుకొని వాడు నాయుడుగా
రి కుమార్తె గృహమ్ము చేరె.

పండ్లను లెక్కించి—జాబు
పఠించి నాయుడి కుమార్తె
'నలభైలో రెండు పండ్లు
వెలతియైన వే'మనియెను.

ఆ మాటకు నారిగాడు
ఆశ్చర్యం పడియిట్లనె—
"అమ్మగారు! రెండు పండ్లు
ఆరగించినాను—నిజము.

కానీ, ఈ జాబు గోతి
లోన పూడ్చినా, ఎట్లా
పసిగట్టినదమ్మా ఈ
వైనం? దీన్నిగదరగా!"

నారిగాడి ఈ మాటకు
నాయుడుగారి కుమార్తెకు
ఏడ్వాలో నవ్వాలో
ఏమీ తెలిసింది కాదు!

వేడిగా నిట్టూర్చి మెల్లిగా బయటికి వెళ్లిపోయాడు.

ఊతకర్ర సాయంతో నెమ్మదిగా నడుస్తూ నరసయ్యమామ వూరుదాటి మామిడితోపు వైపు దారి తీశాడు. నాగమ్మత్త పోయినతరువాత అతడు మామిడి తోటలో స్వయంగా తను వేసుకున్న గుడిసెలోనే ఎక్కువకాలం గడిపి వేస్తుంటాడు. తోటలో అక్కడక్కడా టెంకాయచెట్లుగూడా వున్నాయి. ఈమధ్య దొంగతనాలు ముదిరిపోయి, రేయింబవళ్లు కాపుండకపోతే టెంకాయలు వంబాలకు వంబాలే మాయమైపోతుండడంవల్ల నరసయ్యమామ పాలేరు రాముడితోపాటు రాత్రుల్లో గుడిసెలో పడుకుంటాడు. నిద్రవస్తే నిద్రపోతాడు. లేకుంటే పదాలు పాడుకుంటాడు.

మూతి ముడుచుకుని గుడిసె ముందరున్న మంచంపైన కూలబడిన నరసయ్యమామను చూచి ప్రక్కన్నే వేపచెట్టుక్రిందకి నిరుబావిలో కబిలె తోలుకుంటున్న రాముడు "ఏం బాబయ్యా! అలా వున్నావు" అని అడిగాడు.

"ఏంలేదురా! కాయలు పడిలేచానా! నాలుక కొయ్యలా గిడసబారిపోయింది. ఏది తినబోయినా సహించడంలేదు" అన్నాడు నరసయ్యమామ.

"కారం తగిలించరాదూ మరి!"

# ★ వనభోజనం ★

అన్నాడు రాముడు, బానను బావిలో మునక వేయిస్తూ,

"మన మాటేం సాగుతుంది రాముడూ! అదేదో పండుగ నెలట్నే, పండుగ నెల! ఈ నెల రోజులూ ఒక పొద్దుండాలట! ఇంట్లో ఆవాసనే తగలగూడదంటోంది కోడలు."

రాముడు ఎద్దుల్ని బారిలో నిలబెట్టి గుడిసె దగ్గరికి వచ్చి "చూడు బాబయ్యా! నేనొకటంటాను. నువ్వు మారు చెప్పగూడదు" అన్నాడు.

"ఏమిట్రా అది" అన్నాడు నరసయ్యమామ.

రాముడు కొంతసేపు ఆలోచించి "ఊఁహు. నేను చెప్పను. చెబితే నువ్వు ససేమిరా ఒప్పుకోవు. రాత్రికి నీకే తెలుస్తుందిగా" అంటూ మళ్లీ బావిదగ్గరికి వెళ్లిపోయాడు.

ఆరోజు రాత్రి.

తొలిఝాము గడచిపోయి మలిఝాము ప్రారంభమౌతుండగా రాముడు గుడిసె లోపలికి వచ్చాడు. పొగాకు నములుతూ ఏదో కీర్తన పాడుకుంటున్న నరసయ్యమామ "ఏంరా రాముడూ! ఇప్పుడొస్తున్నావు?" అన్నాడు.

"ఊరికే వస్తున్నానా, ఎంతపని చేశానని! చూడు" అంటూ రాముడు కప్పుకున్న దుప్పటిలోనుంచీ నల్లటి కోడిపెట్టను పైకి తీశాడు.

"అదేంపనిరా బాబూ! ఎక్కడి నుంచీ తెచ్చావు? ఎవరికైనా తెలిస్తే? ఛా. దొంగతనం చేసి ఎవడు తినమన్నాడురా మనల్ని? అంతకన్నా చస్తే నయంకదూ!" అన్నాడు నరసయ్యమామ.

"దొంగతనం చేసిందెవరు బాబయ్యా! నేను! వస్తే ఆ పాపం నాకొస్తుంది. నీకేంభయం! నువ్వూరుకో. కట్టెలు సిద్ధంగా వున్నాయి. కావలిసిన వస్తువలన్నీ సాయంత్రమే యిక్కడికి తెచ్చి వుంచాను. రెండు గడియల్లో కూర్చొండేస్తాను" అన్నాడు రాముడు.

నరసయ్యమామ ఎంతో చెప్పి చూచాడు. కాని రాముడు తను పట్టిన కుందేటికి మూడే కాళ్ళన్నాడు.

*   *   *

మరునాటి వుదయం నరసయ్యమామ ముఖం కడుక్కొని యింటికి వచ్చేసరికి కోడళ్లిద్దరూ పెరట్లో నిలబడి యిరుగు పొరుగు నాలుగైదిళ్ళకు వినబడేట్టు కేకలేస్తున్నారు.

"ఇంతపని చేసిన వాళ్ళు నిద్రపోతున్నప్పుడు గొంతుమీద రాయి వేయరూ! చిన్నదా చితకదా! గుడ్లుపెట్టే పక్వానికి వచ్చిన కోడిపెట్టే!" అంది పెద్దకోడలు రత్నమ్మ.

"ఏనా యింత అన్యాయమా! ఎంత పెట్ట! ఎంత పెట్ట! గంపక్రింద మూసిపెట్టాలని ఎత్తుకోబోతే కుడిచేయి క్రిందికి ఒరిగిపోయేదే!" అంది చిన్నకోడలు బంగారు.

"తినని, తినని! చేను తిడితే శాపం పెట్టినట్టే! పోతారు! నాశనమై..."

రత్నమ్మ మాట పూర్తిగాక ముందే నరసయ్యమామ చరచరా పెరట్లోకి వచ్చి "మహా చూచారులే బంగారుపెట్ట! నోరు మూసుకోండి చాలుగాని! వట్టి ఎముకలగూడు! నమిలి నమిలీ పండ్లే అరిగిపోయాయి" అన్నాడు.

రత్నమ్మ బంగారు ముఖం చూచింది. బంగారు రత్నమ్మ ముఖం చూచింది. ఇద్దరూ ముని పళ్ళతో నాలుకను కొరుక్కుంటూ లోపలికి వెళ్ళిపోయారు. ★




## జరిగిన కథ :—

అది 1866 వ సంవత్సరం ప్రారంభం. సాగర గర్భంలో బ్రహ్మాండమైన జలజంతువేదో కనిపించిందనే వార్త ప్రపంచప్రజలను విభ్రాంతులను చేసింది. సముద్రంలో ప్రయాణంచేసే నౌకల కది ఇట్టే కనిపించి ఇట్టే మాయమయ్యేది. దానివలన నాగరిక ప్రపంచానికి, ముఖ్యంగా నౌకాప్రయాణాలకి ప్రమాదం సంభవించవచ్చునని అందరూ అభిప్రాయపడ్డారు. అమెరికా ప్రభుత్వం అబ్రహాం లింకన్ అనే యుద్ధనౌకను ఆ జలజంతువును వేటాడడానికి నియమించారు. అమెరికా ప్రభుత్వ నౌకాశాఖా కార్యదర్శి హాబ్సన్ ఫ్రెంచి ప్రకృతిశాస్త్రపరిశోధకుడు ప్రొఫెసర్ అరోనాను ఈ విజ్ఞానయాత్రలో పాల్గొన వలసిందని ప్రార్థిస్తాడు. అతడు వెంటనే దాని కంగీకరించి తన పరిచారకుడు కాన్సిల్‌తో సహా ఓడ ఎక్కుతాడు. అబ్రహామ్‌లింకన్ క్రమక్రమంగా పసిఫిక్ ఆమహాసముద్రంలో ప్రవేశిస్తుంది. అది అలాగ కొంతదూరం ప్రయాణం చేసేసరికి కొంతదూరంలో సముద్రతీరంగాలమీద ఒక పెద్ద వెలుగుకనిపించింది. ఆ వెలుగు ఒక పెద్ద జలచరానికి సంబంధించినదై ఉండాలని నౌకాధికారులంతా ఊహించారు. నావ దానిదగ్గిరికి పట్టించి దానిమీద ఫిరంగిగుళ్ళవర్షం కురిపించారు. అబ్రహామ్‌లింకన్ తరవాత జరిగిన పోరాటంలో ఎందుకు పనికిరానిదై పోతుంది. ప్రొఫెసర్ అరోనా, కాన్సెల్ నెడ్‌లాండులతో కలిసి ఒక జలాంతర్గామిలో ప్రవేశిస్తాడు. కొంతసేపటికి ఓడనావికులు వారికి సుష్టుగా భోజనం పెడతారు. భోజనంచేసి అందరూ హాయిగా నిద్రపోతారు. తిరిగీ తమ కన్నపానాలు రాలేదని అంతా మథన పడుతూంటే వారికి హఠాత్తుగా జలాంతర్గామి అధికారి హెచ్చరిక వినిపిస్తుంది. కెప్టెన్ నీమో ఇక ఆ ఓడలోనించి ఎవరు బయటపడలేరని చెప్పి ప్రొఫెసరు అరోనాకు జలాంతర్గామి యంత్రాల రహస్యాలు తెలియజేస్తాడు. ప్రొఫెసర్ అరోనా నీమో గదిలో వింతలు విశేషాలు చూచి ఎంతో ఆశ్చర్యపోతాడు. కెప్టన్ నీమో జలాంతర్గామి నడిపించేపద్ధతి అంతా ప్రొఫెసర్ అరోనాకు తెలియజేస్తాడు. పిమ్మట జలాంతర్గామి కిరువైపులా తెరుచుకున్న అద్దాలలో నించి అద్భుతమైన సాగరగర్భ జలచరాలు కనిపిస్తాయి. ఆ తరవాత జలాంతర్గామి సాగరగర్భంలోని క్రెస్పో ద్వీపానికి బయలుదేరుతుంది.

## 16. సముద్రం అట్టడుగున!

మేమంతా కెప్టెన్‌తో కలిసి ఒక విచిత్రమైన గదిలో ప్రవేశించాము. అందులో అనేకమైన ఆయుధాలు, మందుగుండు సామానులు, సముద్రంలోపల సంచరించడానికనుకూలమైన దుస్తులు కనిపించాయి.

అనువాదం: "వినాయక"

నెడ్‌లాండ్ ఆ దుస్తులు చూసి బాగా చిదరించుకొన్నాడు. తానా దుస్తులు ధరించేదిలేదని తల అడ్డంగా తిప్పివేశాడు!

"నీవు అలాగంటే ఏమీ లాభం లేదు. మనం వేటాడబోయేది సాగర గర్భంలోఉన్న క్రెస్పో ద్వీపంలో! తెలిసిందా?" అన్నాను.

పాపం! ఆ ద్వీపంలో తాజా మాంసం దొరుకుతుందనీ అది కడుపు

నిండా ఆరగించవచ్చనీ నెడ్ లాండ్ ఎంతైనా ఉవ్విళ్లూరాడు. కాని అతని ఆశలన్నీ ఒక్క దెబ్బతో అడుగంటి పోయాయి.

"అయితే మీరా భయంకరమైన దుస్తులన్నీ ధరిస్తారన్నమాట!" అన్నాడు నెడ్.

"అదేమిటి అలాగడుగుతున్నావు? నేనవి వేసుకు తీరతాను!"

నెడ్ లాండ్ బుజాలెగరవేశాడు.

"మీకిష్టంవచ్చినట్లు మీరు చెయ్యవచ్చును! దానికేమి? కాని 'నీకిది మరి తప్పదు!' అంటేతప్ప నేనా వేషం వేసేది లేదు!"

"నిన్నెవరు అంత బలవంత పెట్టరు." అన్నాను.

"కౌన్సెల్ ఆ వేషంలో తల దూరుస్తాడా?" అన్నాడు నెడ్.

"ప్రొఫెసర్ ఎక్కడికి వెడితే నేనూ అక్కడికే వెడతాను." అన్నాడు కౌన్సెల్.

తరవాత ఇద్దరు జలాంతర్గామి నావికులక్కడికి వచ్చి, మాకా దుస్తులు తొడిగారు అవి ఒకవిధమైన రబ్బరుతో తయారుచేసిన దుస్తులు. అవి ఎలాంటి నీటి ఒత్తిడి అయినా తేలికగా తట్టుకోగలవు. ఆ దుస్తులు వేసుకుంటే ఒకవిధమైన కవచం వేసుకున్నట్లుంది. రబ్బరు దుస్తులకు మధ్యమధ్యన రాగి రేకులతో ఏర్పరిచిన ఒకవిధమైన కవచాల ఆకారాలేర్పడ్డాయి. ఆ కవచాలు వేసుకున్నాక సుఖంగా ఇష్టంవచ్చినట్లు సంచరించడానికి మాకేవిధమైన ఇబ్బందీ కలగలేదు.

ప్రొఫెసర్ నీమో వెంట వచ్చిన వాళ్లు పిడిరాళ్లలాగున్నారు. వాళ్లు, కౌన్సెలు, నేను తలలకు చిత్రమైన లోహపు టోపీలు, లోహపు బురఖాలు తగిలించుకొన్నాము.

తరవాత నేను ప్రత్యేకంగా సముద్రం అట్టడుగు అడవిలో వాడే నీటి తుపాకీ చూడాలని అన్నాను.

వెంటనే జలాంతర్గామి నావికుడొకడా తుపాకీ నాచేతికందిచ్చాడు.

అది మొదటినుంచి చివరి దాకా ఉక్కుతో తయారు చేసిన తుపాకీ. దాని మధ్య అంతా కాళీ. చూడడానికది కొంచెం పొడుగ్గానే ఉంది. దానినిండా ఒత్తిడితో కుదించిన గాలి నింపారు. ఇంకా దానిలో 25 తుపాకీగుళ్లు కూడా నింపారు. అవి విద్యుచ్ఛక్తితో తయారు చేసిన తుపాకీగుళ్లు. మీట నొక్కగానే ఒక గుండు ఢామ్ అని పేలుతుంది. దాని స్థానంలో మళ్లీ ఇంకొకగుండు వస్తుంది.



మద్రాసు జంతు ప్రదర్శనాలయానికి ఆఫ్రికానుంచి రెండు నీటి గుర్రాలను (హిప్పొపొటమస్‌లు) రూ. 27000 పెట్టి కొనుక్కొచ్చారు. ఇందులో ఒకదాని పేరు వల్లి—రెండవది మురుగన్. ఈ రెండిటినీ వాటి నివాసంలో కమీషనర్ శ్రీ బాలసుందరం ప్రవేశపెట్టారు. ఈ నీటిగుర్రం పేరు "వల్లి."

# ★ సాగరగర్భంలో సాహస యాత్ర ★

"కెప్టెన్! ఈ తుపాకీ చాలా బాగుంది. బాగా తేలికగా పేల్చ వచ్చును. అయితే నాకొక్కసారి పేల్చాలని ఉంది. - సరే గాని మరి మనం సముద్రం అట్టడుగు భాగానికి వెళ్లిపోవడం ఎప్పుడు?" అన్నాను.

"ఈ క్షణంలో నే. మన జలాంతర్గామి ఇప్పుడయిదు నిలువుల లోతు నీటిలో నిలబడి ఉంది. ఇంకా లోతుకి పోవాలంటే ఇక బయలు దేరడమే తరవాయి."

"మరి ఇందులోనించి ఆ అడివి లోకి వెళ్ళడమెలాగ?"

"చూస్తారుగా!"

తరవాత కెప్టెన్ నీమో నఖశిఖ పర్యంతము ఒక కవచం తొడుక్కున్నాడు. తరవాత కౌన్సెలు, నేను కూడా ప్రయాణానికి తయారయ్యాము. అన్నీ సిద్ధమయ్యాక నేనొక అడుగు కూడా ముందుకు వెయ్యలేక పోయాను. ముందుగా మేమంతా జలాంతర్గామిలో ఒక చిన్న గదిలో ప్రవేశించాము. ఆ తరవాత ఆ గదినిండా నీరెక్కింది. మేమా గదిలో ప్రవేశించిన వెంటనే గది లోపలి తలుపు మూసుకు పోయింది. ఇక అంతా గాఢాంధ కారమే!

తరవాత కొంత సేపటికి మాకొక పెద్ద ఈల వినిపించింది. కాళ్ల దగ్గరనించి గుండెలదాకా శైత్యం కమ్ముకొన్నట్లయింది. సాగర గర్భంలో కళ్లు జిగేలు మన్నట్లొక పెద్ద వెలుగు కనిపించింది. నా కాళ్లు సముద్రం అట్టడుగున నేలమీద నిలబడ్డాయి. నేను నాలుగైదు అడుగులు వేశాను.

ఆ అత్యాశ్చర్యకరమయిన అనుభూతి మాటలతో వర్ణించడం చాలా కష్టం. పదాలకా అత్యద్భుతదృశ్యం వర్ణించే శక్తి చాలదు. చిత్రకారుడుకూడా ఆ అద్భుత దృశ్యం చిత్రించలేడు! ఇంక మాటల మాట వేరే చెప్పాలా?

కెప్టెన్ నీమో మా కందరికీ ముందు నడిచాడు. ఆయన అనుచరులు అతని వెనకాలే నడిచి వెళ్లారు. నేను, కౌన్సెలు కూడా వాళ్ల వెనకాల పడ్డాము. కాని మేమిద్దరము ఒకరొకరికి బాగా దగ్గరగానే ఉన్నాము. క్రమంగా నాకు నా దుస్తుల బరువంతా తగ్గిపోయినట్లనిపించింది. తలకు తగిలించుకొన్న కవచం కూడా ఏమీ బరువనిపించ లేదు.

మా పాదాలదగ్గిర ముప్పదిఅడుగుల వరకు నేల అంతా విద్యుద్దీప కాంతిలో జాజ్వల్యమానంగా వెలిగిపోతూంది. అది చూచి నేను నాకళ్లే నమ్మలేని స్థితిలో పడిపోయాను. 120 అడుగులదూరంలో ఉన్న చిన్న చిన్న వస్తువులు కూడా బాగా స్పష్టంగా కనిపించాయి. ఇంకా కొంత దూరంలో ఉన్న వస్తువులు కొంచెం అస్పష్టంగా కనిపించాయి. నాచుట్టూరా ఉన్న నీరంతా ఒక విధమైన గాలిలా కదలాడింది. కాని అంతలా అద్దంలా స్వచ్ఛంగా స్పష్టంగా కనిపించింది.

మా కాళ్ల కింద సన్న మెత్తని ఇసుక తళతళా మెరిసిపోతూంది. ఇసక అంతా ఎక్కడా నొక్కులు లేకుండా మెత్తని పుప్పొడిలా అతి మృదువుగా ఉంది. దాని మీద సూర్య కిరణాలెంతో స్వచ్ఛంగా అద్దంమీద పడినట్లుగా మెరుస్తున్నాయి.

ఒక అరగంటదాకా నేనా ఇసక మీద నడిచాను. క్రమంగా నాటిలస్ జలాంతర్గామి కొంతదూరంలో అదృశ్యమైపోయింది. అయితే దాని విద్యుద్దీపికసహాయంవల్ల రాత్రివేళ మళ్లీ మేము మా నౌకలోకి వెళ్ళిపోవచ్చును.

తరవాత కొంతదూరం నడిచి నేను కొన్ని రాళ్ళగుట్టలదగ్గిరికి చేరుకొన్నాను. రాళ్ళగుట్టలు స్వచ్ఛమైననీటిలో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

అప్పటికి ఉదయం 10 గంటలయింది. సూర్యకిరణప్రసారంవల్ల సముద్రంలోని దృశ్యాలన్నీ విచిత్రమైనరంగులతో కళ్ళకు మిరుమిట్లుగొల్పుతూ ఎంతో విచిత్రంగా ప్రకాశిస్తున్నాయి. సూర్యకిరణాలా సాగరగర్భంలో కొంచం ఏటవాలుగా ప్రసరించడంవల్ల అలాంటి చిత్రవిచిత్రవర్ణాలా విర్భవిస్తున్నాయని నేను గ్రహించాను.

నిజంగా ఆ చిత్రవిచిత్రవర్ణాలు కళ్లతో చూచి ఆనందించవలిసిందే! ఎంతవర్ణించినా వాటి సౌందర్యం కళ్ళకు కట్టేటట్టు చెయ్యడం చాలా కష్టం. ఆ సౌందర్యం చూస్తూ కౌన్సెల్, నేను అలాగే నిర్ఘాంతపోయి నిలుచున్నాము. అక్కడ మాకెదురుగా కొన్ని పగడపుగుట్టలు కనిపించాయి. మా కవ్వన్నీ మొట్టమొదటగా రాగిగుట్టలలా కనబడ్డాయి. ఇక చిత్రచిత్రమైన ఆకారాలతో అనేకవర్ణాలతో మెరిసిపోయేశంఖాలు, నత్తగుల్లలు మొదలైనవాటిమాట వేరే చెప్పనే అక్కర్లేదు! గుట్టలు గుట్టలుగా పడి వేర్వేరురంగులతో కళ్ళకు మిరుమిట్లుగొల్పే ఆ సాగరగర్భ విచిత్ర వస్తువులన్నీ చూస్తూంటే మా కేదో నూతనప్రపంచంలో ప్రవేశించినట్లయింది!

అలాగలాగ నడిచిపోతూంటే ఒక అరగంటసేపటిదాకా మాకా అత్యద్భుతవస్తువులన్నీ ఎంతైనా ఆశ్చర్యం కలిగించాయి.

క్రమంగా ఒక పాతిక మైలు దూరం నడిచేసరికి మా కెదురుగా కొన్ని కొత్త వింతలు ప్రత్యక్షమైనాయి. తళతళలాడే ఇసకనేల క్రమక్రమంగా బురదనేలగా మారి

## ★ సాగరగర్భంలో సాహసయాత్ర ★

పోయింది. అక్కడ కనిపించే శంఖాలు, వత్తగుల్లలు మొదలైనవి కూడా కొత్తకొత్త రంగులలో ప్రత్యేకమైనాయి.

తరవాత మేమంతా సాగర గర్భంలోని పసిరిపచ్చిక మైదానాల్లో ప్రవేశించాము. ఎంతమృదువైన రత్నకంబళమైనా వాటితో సరిపోలదని చెప్పవచ్చును. ఆ పచ్చిక బయళ్లలో కొన్ని రంగు రంగుల పూలమొక్కలు కూడా ఉన్నాయి. బ్రహ్మ చెముడు డొంకలవంటివి మరికొన్ని కనిపించాయి. కొన్ని కొన్ని రకాల పూల మొక్కలు సముద్రాంతరాళానికి కొంచెం ఎగువగానే ఉన్నాయి. మరికొన్ని రకాలు బాగా లోతులోనే కనిపించాయి.

మేము నాటిలస్ విడిచిపెట్టి అప్పుడే గంటన్నర దాటిపోయింది. ఇప్పుడు మధ్యాహ్నం రెండు గంటలు కావచ్చింది. సూర్య కిరణాలు ఏటవాలుగా ప్రసరించడం మానివేసి నిలువుగానే ప్రసరిస్తున్నాయి. అందువల్ల వేర్వేరు రంగులన్నీ క్రమక్రమంగా అదృశ్యమైపోవడం మొదలుపెట్టాయి.

మేమెంత నెమ్మదిగా నడిచిపోతున్నా మా అడుగుల చప్పుడులు గట్టిగా ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి. సముద్రగర్భంలో ఎంత చిన్న చప్పుడు చేసినా అది వెంటనే అతివేగంగా నాలుగువైపులా ప్రతిధ్వనిస్తుంది. గాలికంటె నీరు నాలుగు రెట్లెక్కువ వేగంతో ధ్వని ప్రసారం చెయ్యగలదనేవిషయం సామాన్యంగా అందరు ఎరిగినదే.

మేము నడిచే సాగరగర్భం భూభాగం ఇంకా లోలోపలికి వెళ్ళిపోతున్నట్లు కనిపించింది. ఇప్పటికి మేము సముద్రంలో సుమారు నూరు గజాల లోతువరకు వెళ్ళిపోయాము. అప్పుడే పది వాతావరణాలఒత్తిడి మామీదపడింది.

అయినా నేను ధరించిన దుస్తుల వల్ల నాకెలాంటి ఇబ్బందీ కలగలేదు. మొట్టమొదట నా వేళ్ళ కణుపులలో కొంచెం నొప్పిపెట్టినట్టుంది. గాని క్రమక్రమంగా అదికూడా తగ్గిపోయింది. నడకవల్ల బాగా అలసట బయలుదేరవచ్చునని అనుకున్నాను. అదికూడా అనుకున్నంత లేదు. ఆనీటిలో నా నడక చాలా సుఖంగా సాగిపోయినట్టనిపించింది.

మేమంతా మూడువందల అడుగులలోతులో ఉన్నాము. అయినా సూర్యకిరణ కాంతి మాకు కొంచం దృశ్యాదృశ్యంగా కనబడుతూనే ఉంది. సాగరగర్భంలో సూర్యకిరణాలప్రకాశం అంతా కొంచెం నీలిరంగుకలిసిన నంజెకెంజాయగా మారిపోయింది. అయినా మాకు దారి స్పష్టంగా కనబడుతూనేఉంది. అంతవరకు విద్యుద్దీప సహాయం అవసరమేమీ కనిపించలేదు.

అలా పదిగజాలదూరం నడిచాము. అందరికంటె ముందు కెప్టెన్ నీమో నడిచిపోతున్నాడు.

అంతలో అతడు హఠాత్తుగా నిలబడిపోయ్యాడు. నేనతనిని సమీపించేదాకా అలాగే నిలుచున్నాడు. మాకింకా కొంచెందూరంలో కొన్ని చెట్లు గుబురులు గుబురులుగా కనిపించాయి.

కెప్టెన్ నీమో వాటికేసి వేలెత్తి చూపిస్తూ - “క్రెస్పోద్వీపంలోని అడివి అదే!” అన్నాడు. అదృశ్యంచూస్తూనే నలాగే నిర్ఘాంతపోయాను.

—ఇంకా ఉంది.

#  అటూ - ఇటూ 

(12-వ పేజీ తరువాయి)

లేనందుకు, కాంతారావుకి అదివరకంతో కించగా ఉండేది. కాని వాడుమాత్రం అదే ఏదో మహోపకారంలాగ తోచింది.

ముందు వాకిలి గేటు దగ్గర నిలబడి చూసేడు. లోన ఎక్కడా దీపం ఉన్నట్టు లేదు. తలుపు తాళం వేసిఉన్నదేమో. లేక లోపట గడియ వేసిఉందో. ఏ సంగతి ఇక్కడనుండి తేలలేదు. వెధవ కర్రగేటు తెరుచుకొనేటప్పుడు కిర్రుమని శబ్దం చేస్తుంది. యిదివరకు అల్లా కావడం బాగానే ఉండేది. ఎవరైనా వస్తున్నటు సులువుగా లోపలకు తెలిసిపోయేది. ఇప్పుడదే ఒక అసదుపాయంగా రూపిస్తోంది.

నెమ్మదిగా సాధ్యమయినంత తక్కువ చప్పుడుతో గేటు తెరుచుకొని, లోన ప్రవేశించేడు. అంతసేపు బిగపెట్టి ఉంచిన ఊపిరి ఒక్కమారుగా బలంగా రావడంతో సర్దుకుందికి కొంతసేపు పట్టింది. నెమ్మదిగా పిల్లిలా అడుగులు వేసుకుంటూ ముందుకు సాగిపోయేడు.

కాని అతని ఈ అతిజాగ్రత్త, నిజంగా, అనవసరం. అతను మామూల్లు కంటే ఎక్కువ చప్పుడు చేసుకుంటూ ప్రవేశించినా గుర్తించే పరిస్థితిలో లేరు లోపలి వాళ్ళు.

ఆమె ఏమన్నదో స్పష్టంగా వినిపించలేదు. కాని వాడు సుందరం గాడి మాటలు చాలా స్పష్టంగా వినిపించేయి. "నువ్వెందుకిలా భయపడుతున్నావో నాకర్థం కాకుండా ఉంది. ఇటువంటి విషయాల్లో మనఆత్మలను నమ్మకోవాలె తప్ప లోకానికి జడవకూడదు. నిన్నెవరూ ఏమీ అనకుండా చూసేందుకు నాదీ పూచీ. కులాసాగా గడపవలసినటువంటి సమయాన్ని...

అతని వాక్యం, పూర్తి కాలేదు. తలుపు మీద ధడ, దడ. చప్పుడయింది. ఆ తలుపు తట్టే విధానంలో లోపలి వారు వచ్చి తెరవాలనే ఉద్దేశం కంటె తలుపు ఒదులు చేసుకొని లోపల ప్రవేశించాలనే ఆతృత ఎక్కువ గోచరిస్తుంది.

ఆ సమయంలో ఆ విధంగా తలుపు తట్టబడడం, సుందరానికీ కొంచెం, బితుకుగానే ఉన్నా "నువ్వేం భయపడకు సంగతేమిటో నేను చూసి వస్తాను" అని ఆమెతో చెప్పి, నడవలోనుండి వస్తూ "ఎవరయ్యా అదీ, నెమ్మదిగా తలుపు పిలవలేరు? మర్యాదమాట అటుంచి తలుపు గడియలు ఊడిపోతే ఇల్లు గల వారికి నేను జవాబుదారీ కావలసి ఉంటుంది" అంటూ తలుపు తెరచేడు.

"ఔను ఇంటియజమానికే జవాబు చెప్పుకోవాలి" అని అరిచేడు కాంతారావు.

"మావయ్యా! నువ్వేనా మావయ్యా! మరెవళ్ళో అనుకొని కొంచెం గాభరాపడ్డాను. సరేగాని నువ్విప్పుడేలా వచ్చేవు? సరిగా నువ్విప్పుడు ఇక్కడికి రావడము చాలా గమ్మత్తుగా ఉంది. హాఁ హాఁ హాఁ" తనను తాను సంబాళించుకో లేకుండా నవ్వ సాగాడు సుందరం.

"ఈ వెధవ వేషాలు కట్టిపెట్టి ముందు లోపలకు పద" అని కర్కశంగా అని సుందరాన్ని చేత్తో లోపలికి నెట్టుతూ నడవ సాగాడు కాంతారావు.

ఆమె గోడవారగా ముఖం దించుకొని, వణకుతూ నిలబడిఉంది.

కాంతారావుకి తన కళ్ళను పొడచుకోవాలనిపించింది. కళ్ళు మూసుకొని. నిలువెల్లా వొణికిపోతూ, నుదుటిమీద చేత్తో బలంగా కొట్టుకొని, వికృతమైన స్వరంతో "నేనంతా విన్నాను. మరేం అబద్ధాలు ఆడకండి. లోకానికి జడవకుండా, ఆత్మలనే నమ్మకోవాలికదూ? ఇటువంటి కుత్సితమైన అవినీతి బ్రతుకు బ్రతికేవాళ్ళకు ఆత్మలు కూడా ఉంటాయా? ఇటువంటి పరిస్థితిలో మరొకడైతే, ఇద్దర్నీ చంపి తను చావవలసిన మాట. మీ ఇష్టం వచ్చినట్లు అఘోరించండి. నే పోతున్నాను."

సుందరానికి మొట్టమొదట వచ్చింది విపరీతమైన నవ్వు. కాని అంతలోనే అది నవ్వుతూ కూర్చుందికి సమయం కాదని గుర్తించి, తొందర తొందరగా వెళ్ళి, కాంతారావు చెయ్యిపట్టుకొని నిలబెట్టేడు.

"ఏమిటి మావయ్యా. నీకేమైనా పిచ్చి పట్టుకున్నదా ఏమిటి?"

"ఆఁ పిచ్చే. మీది మదపిచ్చి. నాది ఉన్మాదం."

"ఏ ఉన్మాదమైనా నిన్ను ఈ స్థితిలో విడిచిపెట్టలేను. రేపు ప్రొద్దున్న అత్తయ్య వచ్చి నన్ను తిడుతుంది. సరిగా ఈవేళే తను అటు బయలుదేరడం, నువ్వు ఇటు రావడం."

"అయితే లోపల గదిలో ఉన్నది మీ అత్తయ్య కాదంటావా?"

"నే చెప్తే కాని నీ కళ్లను నువ్వు నమ్మలేవన్నమాట. అంతగా అత్తయ్యను మరిచిపోయేవు కాబోలు. నీ ప్రవర్తనను గురించి వచ్చిన పుకార్లు నిజమే అయిఉంటాయి అన్నమాట. సరే మీ గొడవలతో నా కేమి

# ★ అటూ - ఇటూ 

సంబంధం, ముందు లోపలికి రా" కాంతా రావును భుజం పట్టుకొని లోపలికి నడిపించుకొని వెళ్తూ "సీతా నువ్వు మరేం భయపడకు. ఇదంతా మా మామయ్య నిష్కారణంగా అపోహపడినదాని ఫలితం."

కాంతారావు ఒక కుర్చీలో కూలబడి కళ్ళు మూసుకొని చేత్తో నుదురు పట్టుకొని ఏ మాటా లేకుండా ఉండిపోయేడు కొంతసేపు. సుందరం, మెల్లిగా అంతా వివరించాడు—అక్కడ స్కూలు టీచరు రామమూర్తిగారి భార్య వరలక్ష్మికి తనకు ఏదో సంబంధం వున్నట్టు వచ్చిన గాలివార్తను క్రమంగా కాంత విశ్వసించి, ఉద్యోగంకంటె తనకు కాపురమే ముఖ్యమని, ఉద్యోగానికి రాజీనామా ఇస్తాననడమూ, తామంతా బోధపరచి, ఇది కట్టి గాలివార్త మాత్రమే అయి ఉంటుందని, కావాలంటే కొన్నాళ్ళు సెలవుపెట్టి వెళ్ళి ఉండమని చెప్పిన సంగతీ-నాటి మధ్యాహ్నమే ఆమెను రైలుకి దిగబెట్టిన వైనమూ-ఈ సీతా అనే అమ్మాయిని తమ ఉభయుల తల్లిదండ్రుల అభిమతాలకు విరుద్ధంగా రిజిస్ట్రేషను పద్ధతిని పెళ్ళిచేసుకోబోతున్న విషయమూ, ఈ సందర్భంలో తమను కాంత ప్రోత్సహించిన పద్ధతి అంతా పూసగుచ్చినట్లు చెప్పేడు.

కాంతరావు ఒక పదినిమిషాలు నిశ్చలంగా కూర్చొని దిగ్గునలేచి "ఒరే బాబూ సుందరం, జరిగిందేదో జరిగిపోయింది. ఈ సంగతి మాత్రం ఎప్పుడూ మీ అత్తయ్యదగ్గర ఎత్తనని మాట ఇవ్వాలి. ఇప్పుడు పన్నెండు గంటలకి నాకు ఒక రైలుఉంది. నేను వెళ్ళిపోతాను. నేను వెళ్ళేలోగా ఆమెగాని అటునుంచి ఇటు బయలుదేరిన స్తే రేపు నువ్వు ఆమెను తోడ్కొని రావాలి. మీ పెళ్ళికి నేనూ ఆమోదించడమే కాక నీకు ఒక మంచి సూటు ఈ అమ్మాయికి ఒక మంచి చీరకొని ఇచ్చుకుంటాను."

అతను వద్దంటున్నా సుందరం అతనితో కొంత మేరవెళ్ళి, రిక్షాలో కూర్చొబెట్టి "మరి నేనుఉంటాను మావయ్యా. అక్కడికి వెళ్ళి అత్తయ్యను చూట్టంతో మాకిస్తామన్న పెళ్ళికట్నం మాట మాత్రం మరిచిపోకు" అన్నాడు. ★

(-38వ పేజీ తరువాయి)

ఫ్రాయంట్ ఊహించింది నిజమేనన్నమాట. ఆరోజంతా అతడు దొరికిన సాక్ష్యాలన్నీ పరిశోధించాడు. పబ్లిక్ ప్రాసిక్యూటర్ దగ్గరకువెళ్లి కొన్ని కాగితాలు పరిశీలించాడు. జైలు అధికారివద్దకుపోయి కొన్ని ఫోటోలు తెప్పించి చూశాడు.

ఆరాత్రి హార్వే ఫ్రాయంట్ నిశ్చింతగా నిద్రపోయాడు. అతడు బసచేసిన ఇంగ్లీషు హోటలులోని గదిలో పడుకుని, విశేష ప్రజ్ఞావంతులైన పోలీసు అధికారులు కూడా ఛేదించలేని రహస్యాన్ని తాను ఛేదించానని తృప్తితో, గర్వంతో చిరునవ్వు నవ్వుకున్నాడు. అరుణవలయం రహస్యం అతనికి తెలిసిపోయింది.

## 30. ఫ్రాయంట్ అంతం

హార్వే ఫ్రాయంట్ ఫ్రాన్సు వెళ్ళిన సంగతి దాగలేదు. డెరిక్ యేల్‌కూ, ఇనస్పెక్టర్ పార్‌కూ ఆ విషయం తెలిసింది. థాలియా డ్రమండ్ పంపిన తంతివార్త అందితే అరుణవలయానికి కూడా తెలిసే ఉంటుంది.

ఫ్రాయంట్ విజయగర్వంతో ఫ్రాన్సునుండి తిరిగివస్తున్న సాయంకాలమే డెరిక్ యేల్ పోలీసు ప్రధాన కార్యాలయానికి వెళ్లాడు. పార్ అక్కడికి వచ్చేసరికి యేల్ అతని బల్లవద్ద కూర్చుని ఉన్నాడు. అతని చుట్టూ కొందరు పోలీసు అధికారులు కూర్చుని అతని అలౌకిక శక్తుల ప్రదర్శనకు విస్తుబోతున్నారు.

ఒక పోలీసుఇనస్పెక్టరు అతనికొక ఉంగరం ఇచ్చాడు. దాన్ని చూసి యేల్ అతన్ని గూర్చి అందరికీ తెలిసిన కొన్ని సంగతులేకాక, ఎవరికీ తెలియని కొన్ని వ్యక్తిగత రహస్యాలు కూడా చెప్పగలిగాడు. దీంతో అందరూ ఆశ్చర్య చకితులయ్యారు.

పార్ లోపలికి వచ్చేసరికి ఒక జవాను ఒక కవరు తెచ్చియిచ్చాడు. దానిమీద అడ్రసు టైపుచేసి ఉంది. దాన్ని యేల్ చేతిలో పెట్టి "ఇది ఎవరు పంపించారో చెప్పు" అని అడిగాడు.

యేల్ నవ్వాడు: "పొట్టి మనిషి, పసుపు పచ్చని గడ్డం గలవాడు, ముక్కుతో మాట్లాడతాడు, వాడికొక అంగడి ఉంది."

పార్ ముఖంపై మెల్లమెల్లగా చిరునవ్వు కనిపించింది.

"దీనికి విశేషశక్తులేమీ నేనుపయోగించలేదు. నాకు తెలుసు ఈ ఉత్తరం విల్ డ్రెడ్ వీధిలోని ఒకానొక జాన్సన్ నుంచి వచ్చిందని."

ఇన్‌స్పెక్టరు తెల్లబోవడం చూసి యేల్ మళ్లీ నవ్వాడు. ఇద్దరూ ఒంటరిగా ఉన్న సమయంలో యేల్ ఇలా చెప్పాడు:

"అరుణవలయానికి వెళ్లవలసిన ఉత్తరాలన్నీ ముందు ఎక్కడికి చేరతాయో నువ్వు కనిపెట్టినట్లు నాకు తెలుసు. నాకు దాన్ని గురించి నీకంటే ముందే తెలుసు. అరుణవలయానికి వెళ్లే ప్రతి ఉత్తరం నేను చదవకుండా వదిలిపెట్టలేదు. నువ్వు ఏదో నాకబు చేస్తున్నావని జాన్సన్ నాతో చెప్పాడు. ఉన్నదున్నట్లు అంతా నీతో చెప్పమని వాడితో చెప్పాను."

"అంటే నీకిదంతా ఇదివరకే తెలుసన్న మాట" అని పార్ అడిగాడు.

"ఆ అరుణవలయం ఉత్తరాలన్నీ మొదట ఈ జాన్సన్ అనేవాడికి చేరుతున్నాయని నేను కనిపెట్టాను. వాడు పత్రికల వ్యాపారం చేస్తున్నాడు. ప్రతిరోజూ మధ్యాహ్నం ఒక బాలుడు వచ్చి ఆ ఉత్తరాలు తీసుకుపోతూ ఉంటాడు. కానిదారిమధ్యలో ఎవరో వాడి జేబులోంచి ఉత్తరాలు కాజేస్తూ ఉంటారు. వాడెవడో మాత్రం నేనింతవరకూ కనిపెట్టలేకపోయాను."

"కాజేస్తూ ఉంటాడా?" అని పార్ ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును. ఆ బాలుడు ఉత్తరాలు జేబులో పెట్టుకుని నడుస్తూఉంటాడు. బాగా జనసమ్మర్దంగా ఉన్నచోట నడుస్తూఉండాలని వాడికి ఉత్తర్వు ఇవ్వబడింది. అలా వాడు దిక్కులుచూస్తూ నడుస్తున్నప్పుడు, వాడికి తెలియకుండా అసలు యజమాని ఎవడో వచ్చి ఉత్తరాలు కాజేసిపోతాడు."

యేల్. ఖాళీచేసిన కుర్చీలో కూర్చుంటూ పార్ "నువ్వు చాలా అద్భుతమైన మనిషిలాగా ఉన్నావే!" అన్నాడు. "ఇంకా ఏమేమి తెలిసింది?"

"నేను మొదటినుంచీ అనుమానిస్తున్నదే. థాలియా డ్రమండ్ అరుణవలయం'తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతోంది. తనకు తెలుస్తున్న వార్తలన్నీ ఆమె అరుణవలయానికి చేరవేస్తోంది."

"అయితే ఏం చేద్దామనుకుంటున్నావు నువ్వు?" పార్ అడిగాడు.

"ఆమెఎప్పుడో ఒకప్పుడు అరుణవలయం విషయంలో మనకు ఉపయోగిస్తుందని నేను మొదటినుంచీ చెబుతూనే ఉన్నాను. నేనన్నది ఎప్పటికో జరిగితీరుతుంది. అరుణవలయం ఉత్తరాలన్నీ నాకు ముందు చూపించమని నేను జాన్సన్‌తో చెప్పి రెండు నెలలైంది. అతడు మొదట్లో అది తప్పని ఒప్పుకోలేదు. వాణ్ణి మొత్తానికి నయానా భయానా ఒప్పించాను. నేను పోలీసు అధికారిననికూడా అబద్ధమాడాను. అందుకు నువ్వేమీ అనుకోవనుకుంటాను. అలా చెబితేగాని వాడు లొంగిరాలేదు మరి"

"ఒక్కొక్కసారి నువ్వు నిజంగా పోలీసు అధికారివే అయిఉంటే ఎంతో బాగుండునని నాకనిపిస్తూ ఉంటుంది. ఇంతకీ థాలియాడ్రమండ్ అరుణవలయంతో వ్యవహరిస్తోందన్నమాట" అన్నాడు పార్.

"అయినా నేను ఆమెను ఉద్యోగంనుంచి తీసివేయడం లేదనుకో. ఆమె నాకు సమీపంలో ఉన్నంతసేపూ ఆమె వల్ల ప్రమాదమేమీ జరగదు."

"ఫ్రాయంట్ ఫ్రాన్సు ఎందుకు వెళ్ళినట్టు?" పార్ అడిగాడు.

యేల్ భుజాలెగరవేశాడు. "అతనికి

 

# అరుణవలయం



విదేశాలతో వర్తకసంబంధాలున్నాయి మళ్ళీ ఏదో కొత్త వ్యాపారం తలపెట్టి ఉండవచ్చు. షాంపేన్‌లోని ద్రాక్షతోటల్లో మూడో వంతు అతనివే. నీకు తెలుసుగా?"

ఇన్‌స్పెక్టరు తల ఊపాడు. కొంతసేపు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు. ఉభయులూ తమ తమ ఆలోచనలలో మునిగి తేలుతున్నారు. ముఖ్యంగా ఫ్రాయంట్‌ను గూర్చి పార్ ఆలోచిస్తున్నాడు. ఫ్రాయంట్ టులూజ్ నగరం ఎందుకు వెళ్ళాడో అతనికి బోధపడలేదు.

"అతడు టులూజ్ వెళ్ళాడని నీకెలా తెలుసు?" డెరిక్ యేల్ ప్రశ్నించాడు.

హఠాత్తుగా వచ్చిన ఈ ప్రశ్నకు పార్ అదిరిపడ్డాడు. తన మనస్సులో తాను ఆలోచిస్తున్న దాన్ని యేల్ ఎలా ఊహించాడు?

"ఇతరుల ఆలోచనలను కనిపెట్టే విద్య కూడా ఉందన్నమాట నీకు?" అన్నాడు పార్.

"ఒక్కొక్కసారి కనిపెట్టగలను" అని యేల్ గంభీరంగా అన్నాడు. "ఫ్రాయంట్ పారిస్ వెళ్ళాడనుకున్నానే!"

"ఉహూ, అతడు టులూజ్ వెళ్ళాడు."

అన్నాడేగాని పార్ అది తనకెలా తెలిసిందో చెప్పలేదు.

డెరిక్ యేల్ ఇదివరలో ప్రదర్శించిన అలౌకికశక్తులేవీ ఇన్‌స్పెక్టరు పార్‌కు ఇంతగా దిగ్భ్రమ గొలుపలేదు. హఠాత్తుగా తన మనసులో ఉన్నదాన్ని ఉన్నట్లుగా చెప్పివేయడం అతనికి ఆశ్చర్యం కలిగించింది. అంతేకాదు, ఒక విధంగా అతనికి భయం కూడా పట్టుకుంది. చాలసేపటివరకూ అతనికా భయం తొలగలేదు. ఇంతలో హార్వీ ఫ్రాయంట్ ఇంటినుండి టెలిఫోను పిలుపు వచ్చింది.

"నువ్వేనా, మిస్టర్ పార్? నువ్వు వెంటనే మా ఇంటికి రావాలి. యేల్‌ను కూడా తీసుకురా. ఒక ముఖ్యమైన విషయం చెప్పాలి నీతో."

రిసీవరు మూసివేసి పార్ తనతో తానే బిగ్గరగా "ఫ్రాయంట్‌కు తెలిసింది ఏమై ఉంటుంది?" అనుకున్నాడు. పార్ టెలిఫోనులో మాట్లాడుతున్నంత సేపూ అతని ముఖం వంకే చూస్తున్న డెరిక్ యేల్ ముఖంలో ఒక వింత మెరుపు మెరిసింది.

(ఇంకా ఉంది)

# ప్రమాదో ధీమతా మపి?

(35- పేజీ తరువాయి)

కాబట్టి, తగిన ప్రచారంతో ఈ చిత్రాన్ని కూడా, మిగతా పెద్ద చిత్రాలలాగే కళ్యాశ్వత్తంగా వాణిజ్యస్థాయిలో ప్రదర్శనకు విడుదల చేయడం అవసరం అవుతోంది. ఈ సంస్థకూడా అలాగే అనుకొంటున్నట్లు తెలుస్తోంది. ఈ దృష్ట్యా శ్రీ సిప్పి నిర్మించే "లైట్ హౌస్"కు, వీరి "లైట్ హౌస్"కూ పోటీ, తద్వారా పేరులో పేచీ వస్తాయి.

మామూలుగా నిర్మాతలు, ఒకరు తీసుకొన్న కథను మరొకరు తీసుకోవడం (నాగపంచమి, నాగులచవితి లాగ), ఒకరు పెట్టిన పేరే మరొకరు వాడుకోబోవడం (రౌహూటీకా లేక) అవాంఛనీయమనీ, ఆధోరణిని అరికట్టాలనీ పెద్దాచిన్నా విమర్శిస్తున్నారు. ఇప్పుడు బాల చలనచిత్ర సంస్థవంటి బాధ్యతగల సంస్థ విషయంలోనే ఇటువంటిది జరుగుతోంది. ఈ పేరు మార్పించవలసిందిగా నిర్మాతల సంఘం ద్వారా ఈ సంస్థను కోరుతున్నట్లు శ్రీ సిప్పి ప్రకటించారు.

---

"చార్ దోస్త్" అనే పిల్లలచిత్రం దర్శకుడు శ్రీ బి. ఎస్. సర్కార్ అని గత వారం "ఆంధ్రపత్రిక"లో పడింది. ఆ చిత్రానికి శ్రీ సర్కార్ నిర్మాత, శ్రీ నితిన్‌బోస్ దర్శకుడు అని గమనించ ప్రార్థన.

# గీర్వాణభాషాభ్యాసం

(10 వ పేజీ తరువాయి)

ఆపైన సార్వభౌములు కూడా సంస్కృత పాండిత్యం లోతులు చక్కగా ఆకళించుకొన్నారు. అయితే ఒక్క మనవి!

ఇంద్రచంద్ర వ్యాకరణావతరించినా పాణినీయం ముందవి దివిటీముందు దివ్వెలే అయి ఊరుకున్నాయి. ఇక శర్వవర్మ మాత్యుల వ్యాకరణంమాత్రం అంతకంటే వెలగబెట్టేదే ముందిలే! అని నేను మొట్టమొదటినించీ ఈ విషయం అంతగా లక్ష్యపెట్టనేలేదు. కాని ఈ క్షణంతో నాకా భ్రమ తొలగిపోయింది.

అథవా, కలాపకవ్యాకరణంవల్ల సంస్కృతాధ్యయనానికి కొంత సౌలభ్యం చేకూరిందని అనుకొన్నా-ఆరుమాసాలలో గీర్వాణపాండిత్యం సాధించవచ్చునంటే నాకే మాత్రము నమ్మిక కలగలేదు! ఆరుమాసాల పాటహోరాత్రాలు కష్టిస్తే ఏదో ఎంపగారి వ్రతానికి కల్పం చెప్పడానికి తగినంతటి ప్రవేశం కలిగితే కలగవచ్చునని అనుకొన్నాను. మహా గహనమైన గీర్వాణ వాణీ పాండిత్యంలో అనేకమైన పెద్దపెద్ద అంతరువులున్నాయని భావించడంవల్ల నేనిటువంటి భ్రమప్రమాదాలకు గురి అయినాను!

అయితే సార్వభౌములనితర సాధారణ ప్రతిభావంతులు కావడంవల్లను, ఆపైన శర్వవర్మామాత్యుల ప్రజ్ఞాపాటవం కూడా తోడుపడడం వల్లను ఏలినవారి సంకల్పం ఇంత తేలికగా నెరవేరిందని అనిపించింది. ఇక దేవసేనాని అయినటువంటి కుమారస్వామి కటాక్షం ఒకటే మన అందరిమీద ఉండనే ఉన్నదిగదా! ఆ స్వామి కటాక్షం వల్ల దేవర వారి కీర్తి దిగ్దిగంతాలవరకు వ్యాపింపవలెననీ, శ్రీవారి కిత్తోధిక శ్రేయోభివృద్ధి చేకూరవలెననీ, వారి కరుణాకటాక్షపాతంచేత బౌద్ధప్రాబల్యం వల్ల అట్టడుగున పడిపోయిన గీర్వాణవాణి తిరిగి సార్వభౌములకు శిరోధార్యమై విరాజిల్లవలెననీ కోరుకుంటున్నాను."

గుణాఢ్యుని ప్రసంగం పూర్తి అయ్యేసరికొక క్షణకాలంపాటు కొలువుకూటం అంతా చిత్రప్రతిమలా మారిపోయింది. శర్వవర్మకు, చక్రవర్తికి ముచ్చెమటలు పోశాయి. అయినా వారిద్దరూ అతి గంభీరంగా ఉండి వెనువెంటనే చిరునవ్వులు చిందించారు. శర్వవర్మ సమస్తము తన కనుకూలంగానే సాగిపోతున్నదని లోలోపల ఆనందిస్తూనే ఉన్నాడు. అంతలో నే హఠాత్తుగా విదూషకుడు లేచి నిలుచున్నాడు:

"మహాప్రభూ! గీర్వాణాధ్యయనానికి తమ కారుమాసాలెందుకు? ఆరు రోజులు చాలవా? అని అనుకొన్నాను. గుణాఢ్యులంతటివారే తమ ప్రతిభా గుణగణాలు ప్రశంసించిన తరవాత తమ కారురోజులు కూడా అక్కరలేదనీ, ఆరుక్షణాలే చాలునని అనిపించింది!

ఇకనుంచీ నేను తమదగ్గర గీర్వాణాధ్యయనం చేదామని సంకల్పించాను. "శిష్యస్తేహం శాధిమాం ప్రపన్నమ్!" అన్నట్లు అర్జునునిలాగే నేనూ తమ అంతేవాసిత్వం అభ్యర్థిస్తున్నాను. కటాక్షించండి!"

అని అతివినయంగా అభ్యర్థన నటించడం ప్రారంభించాడు. ఆ వికట నటన చూడగానే సదస్యులు ప్రస్తుత వృత్తాంతంఅంతా విస్మరించి కలకలా నవ్వడం ప్రారంభించారు!

—సశేషం.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press. 6 & 7. Thambu Chetty Street. Madras-1. Editor S. Sambhu Prasad.

